శ్రీ

# పద్యకథామంజరి

FOR

'Comprehension text'

OF

**IV V & VI Forms.**




గ్రథనకర్త:

ధరణికోట వేంకటసుబ్బయ్య, ఎం. ఏ., బి. ఇడి.,

శ్రీ

# పద్యకథామంజరి

(ప్రాచీనాంధ్రకావ్యములనుండి సంగ్రహితము)




ప్రణేత:

ధరణికోట వేంకటసుబ్బయ్య, ఎం. ఏ., బి. ఇడి.,

ఆంధ్రోపన్యాసకుడు,

వేంకటగిరిరాజ కళాశాల, నెల్లూరు.



ప్రకాశకులు:

వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,

4 మల్లికేశ్వరగుడి సందు,

ముత్యాలపేట, మద్రాసు.

వెల 1 రు.



యా దుగ్ధాపి న దుగ్ధేవ
కవిదోగ్ధృభి రన్వహమ్,
హృది న స్సన్నిధత్తాం సా
సూక్తిధేనుః సరస్వతీ.

స్వయముగనే తేటపడుచున్నను—నక్షత్రాంకిత మొదర్చిలిపి. ఇట్టిమార్పులు ప్రకృతోద్దేశ్యమునకు అనుగుణ్యము సంపాదింప అనివార్యముగ నొనర్పంబడినవేయైనను, ఏకత్వాసమునకు భంగకర్త్యముండె నని పెద్దల నేడుకొనుచున్నాఁడను.

పద్యకథాప్రవచనమునుగూర్చి,— 1915 వేసవిసెలవులలో (మే 16 మొదలు జూన్ 15 వఱకు) నెల్లూరిలో తన్మండలోపాధ్యాయమహాజనసంఘముచే కొనసాగింపఁబడిన పండితోపాధ్యాయుల బోధనశిక్షాసందర్భమున నా యిచ్చిన కొన్ని సూచనలను ఇటఁ బొందుపఱుచుచున్నాఁడను,—

1. ప్రథమదశలో—విద్యార్థులకు పద్యకథను ఉపాధ్యాయుఁడు చక్కఁగా చదివి వినిపింపవలెను.
2. పిమ్మట ఒక్కొక్కవిద్యార్థియుఁ దనకుఁ దాను చదువుకొని సరుసన్వయించుకొనఁ బూనవలెను. కథకు నిచ్చియున్నటీక ప్రాయికముగ నందఱకుఁ జాలియుండెను. చాలదనుకొన్నచో, పిల్ల లడుగుచో దానిని వృద్ధిపఱుపవచ్చును.
3. కథ పిల్లలతోఁ జెప్పనురాదు; విద్యార్థిచేత చెప్పించనురాదు. ఏలన, అట్టిచో ఒక్కొకవిద్యార్థియు ఏమాటగ్రహించెనో తెలిసికొన వీలులేకపోవును. అందుచే, ఈ 'Comprehension test' అర్థవంతము కాకపోవును.
4. కథాసంగ్రహము వ్రాయించుటకు ముందే ప్రశ్నలకు ఉత్తరములు వ్రాయింపవలెను.
5. యథోచితముగ కొంత పద్యకథాభాషను విద్యార్థి కథాసంగ్రహరచనయందు ఉపయోగించుకొనవచ్చును. సర్వస్వాపహరణము మాత్రము పనికిరాదు.
6. పిల్లలు దిద్దినప్పుడు విద్యార్థులు పద్యముల నర్థముచేసికొనుటయందేమి చేయుచున్న తప్పులను తెన్నుగా నిరూపించి చూపి భాషామార్గము నాగమపఱుపవలెను.

# విషయసూచిక

శ్రీ రస్తు:

# పద్యకథామంజరి.

## 1 బక హంస సంవాదము.

ఉ. "ఎవ్వఁడ వీవు, కాళ్లు మొగ
మెఱ్ఱన?" "హంసమ"; "నెందు నుందువో?"
"దవ్వుల మానసంబునను;"
"దాన విశేషము లెవ్వి? తెల్పుమా;"
"మవ్వపుఁ [1]గాంచనాబ్జములు
మౌక్తికముల్ గల వందు;" "నత్తలో?"
"అవ్వి యెఱుంగ;" మన్న, నహ
హా! యని నవ్వె బకంబు లన్నియున్.

—అజ్ఞాతమూలకము.

1. బంగారు తామరపువ్వులు.

## 2 బాలధి.

సీ. బాలధి యనుముని ప్రవరుండు పుత్త్రశో
కాపన్నుఁడై, ఘోర మగు తపంబుఁ
జేసి, వేల్పులదయఁ జిరజీవిగాఁ బుత్త్రుఁ
బడసె, మేధావి నాఁ బరఁగువాని;
వాఁడు నాయుష్యగర్వమున మునీంద్రుల
నెవ్వారి మెచ్చక, యేఁగి యొక్క-

ధనుషాత్ముఁ డనుతపోధనునోద్ధ గర్వించి
పలికిన, నలిగి తపస్వి వాని

ఆ. నంతకాంతికమున కరుగంగఁజేసె ; గ
ర్వంబు చెట్టి యెట్టివారి కైనఁ ;
1గ్రాఁచుఁ దక్షణంబ గర్వంబు ; గర్వంబు
నోడిచి యున్నవాఁడ యుత్తముండు.

—అరణ్యపర్వము. III.

1. నశింపఁజేయును.

### 3 వ్యర్థబోధనం బనర్థకరము.

తే. కానఁ దిరుగాఁడ కోకచోటఁ గపులు గూడి
కడిఁదిచలిచేత మేనులు కడు వడంక,
రాత్రి మెఱుఁగారు 1ఖద్యోతరాజిఁ జూచి
2కణఁకు గాఁబోలు నని 3సీతు గాఁచుచుండ. ౧

క. సూచీముఖ మనువిహగం
బా చేరువ నుండి యసల మది గా దని యా
లోచన చేసి యొకకపి
కాచందము తెలియఁ జెప్పె నాదరలీలన్. ౨

క. ఈరీతిఁ బులుఁగు పిలువని
పేరఁట మే తెంచి; చెవులు బీఱువడన్ వే
సారక చెప్పఁగ, నం దొక
క్రూరప్లవగంబు పండ్లు గొఱుకుచుఁ గినుకన్. 3

(వేంకటనాథుఁడు.)

"అడుగ 1నూర కేల నొడ్డఁ బుదు విప్పుడు;
2వట్టినోటికేల పుట్టె" నన్ చుఁ
బట్టి దాని 3రాతిపైఁ బ్రాఁకి వధియించె;
వ్యర్థబోధనమ్ము ననర్థకరము. ౮

—పంచతంత్రము - మిత్రభేదము.

1 మిడుఁగురులుఁ బురుగుల గుంపును. 2 నిప్పు. 3 చలి.

## 4 వాగ్దోషము.

సీ. ఒకయూర నొకచాకి యొక్కగాడిదఁ దెచ్చి
దాని లావుగ మేపఁ దలఁపు పుట్టి,
పులితోలు పైఁ గప్పి పొలఁగ బండినచేలు
మేయ రాత్రులు దోల మేసి తిరుగఁ,
బులి యనుబుద్ధి నా పొలము కావలివారు
దూరంబుననుఁ జూచి తొలఁగి పఱవఁ,
బై రెల్ల వృథ యైనఁ బరికించి, యొకనాఁడు
విడివి యొక్కరుఁడు సాహసముతోడఁ

తే. గడఁగి దూరంబునందునఁ గంబళంబు
గప్పికొని, వింట శర మిడి కాచియుండ,
నాఖరము వచ్చి యాతని నచటఁ గాంచి
పెంటిగాడిద యని చాలఁ 1బృథురవమున. ౧

వ. చేరం జూచి, దానికయి పొంచియుండినయతండు. ౨

క. పులి యని పొఱిఁబడి; నక్కట;
బల్లుగాడిద, మెలఁగుకతన బైలయ్యె; నిఁక

దొల్లఁగ భయం బేల?" అని యొక
[2]యలఘు ప్రదరమున జానిసుపుత్రులఁ బాపె. 3

—పంచతంత్రము, సంధి.

1 పెద్దధ్వనితో. 2 పెద్దబాణముతో.

## 5 భేరీ జంబుకముల కథ.

తే. ఏపుఁగ నాఁకటి పెల్లున నిందు నందు
నడవిఁ జరియించి, యాహార మబ్బకునికి
నలసి, యొకజంబుకంబు భాగ్యమునఁ గాంచెఁ
గలహ మొనరించి పోయిన [1]కదనభూమి.

వ. అందుఁ బడియున్న బహుప్రాణికళేబరములఁ గౌతుకముతోఁ గనుచుండ గుండె లవియు నొకమహాధ్వని యుప్పతిల్లుడు, ౨.

సీ. అమ్మహాధ్వని విని యత్యంతభయముతో
[2]మృగధూర్త మిట్టిట్టు మెదల వెఱచి,
కను మూసి తెఱచి, 'కెక్కడఁ జొత్తు' నని బుద్ధి
శోకించి, కను విచ్చి చూచునంత,
ధారుణిఁ బడియున్న భేరీముఖంబునఁ
దరుశాఖ గాలిచేఁ దాఁకుచుండఁ
బొడగని తనలోనఁ బొడమినభయ ముడిగి
పోయిన, నాభేరి డాయ వచ్చి,
తే. "అప్పు డిది గాన నేనిక యధికభీతిఁ
బాఱిపోవంగఁ జూచితిఁ బట్టి విడిచి;

గీ. నచటి కొక్కనక్క యరుదెంచి ముదమంది,
"యేనుఁ గాలునెలలు, మానవుండు
సప్తవాసరములు, సర్ప మేకదినంబుఁ,
బోవుఁబొమ్ము నాకు భుక్తి" కనుచు. ౧

క. "నేఁటి కివి గంటి వెట్టఁగ
నేఁటికి ? నీబోయ వింట నిడ్డనరము లీ
పూఁటఁ గడపఁ జాలవె ? యొక
నాఁటం బ్రాణంబు నను నె నవసినమాత్రన్ ?" ౨

(కేయూరబాహు ౹౹౹).

వ. అని తలంచి,

ఉ. గ్రక్కునఁ జేరి నక్క కితమ
కంబునఁ జచ్చినబోయయొద్ద, ము
న్నెక్కిడి యున్న వింటి4గుణ
మిమ్ముగఁ దాఁ గొఱుకంగ, దానికొ
మ్మొక్కునఁ దాఁకి తీవ్రముగ
నవ్వల వెళ్ళినఁ, జూలెఁ ; గావునన్
బక్కిలి లోభి యానతఁడు
మీఁదటికార్యముఁ గాన నేర్చునే ? 3

—పంచతంత్రము.

1 పుట్ట. 2 చచ్చెను. 3 కొనకతో. 4 అల్లెత్రాడు. 5 బొమ్ము.

**7 అమృత మాలసింహ నౌ విషంబు.**

సీ. ఆలస్యమును ససహాయత్వమును నొప్ప ;
వసి లేని 1పతి సుఖియై చరించు ;—

మునుపొక్క ²లొట్టెనుఁ గనితరసాధ్య త
పంబు సేయఁగ మెచ్చి బ్రహ్మ వచ్చి,
"యర్థించినది యేమి?" యనిన, నాలొట్టెనుఁ
³"యొప్ప నా మెడ శత యోజనప్ర
మాణం బగుట కోర్కి, వాణీశ ;" నావుఁడు,
నట్లగుంగా;"కని యతఁడు సనియె ;
తే. నదియు వరగర్వమున సహాయంబునొల్ల
కలసభావంబుతో నుండి, వలచి యొక్క
నాఁడు దనయత్తు సాఁచి కాననములోన
³దీనుకొని మేయఁ గాఁ బెనువాన వచ్చె. ౧
క. వచ్చినఁ, దన మెడ సాఁగిన
యచ్చోటి గుహలోన ⁴నుత్తమాంగం బిడి, తా
నిచ్చమెయి నిదురపోవఁగ ;
విచ్చలవిడి నొక్కనక్క పెలఁదియుఁ గాంచెన్. ౨
*ఉ. ఆ గుహ సొచ్చి, మిక్కుటపు
టాఁకలి బాధకు నోర్వలేక, వే
వేగను లొట్టెకుత్తుకను
వేడ్కమెయిన్ గబళించి, నెత్తురుల్
ద్రాగుచుఁ, గండలన్ దినుచుఁ,
గ్రాలుచు, మేల్కొని లొట్టె ప్రక్కగు
ల్లాగి పొరల్చు కంఠమును,

[illegible] ౩

వ. ఆ మృగధూర్తదంపతులు దానికంఠనరంబులు తెగఁ గొఱికె;
నలసత్వంబున నుష్ట్రంబు నిర్గతప్రాణం బయ్యెను. ౪

—శాంతిపర్వము III.

1 రాజు. 2 ఒంటె. 3 హాయిగా. 4 తల. 5 అధిక్షేపోక్తులు.

## 8 సోమశర్మజనకుఁడు.

సీ. పరగ విద్యాభ్యాసపరుఁ డొక్కవిప్రుఁడు
తనియ [1]మహాలయంబున భుజించి
చనుదేర, నొండొక [2]సదనంబువిప్రుండు
పితరులకై పేలపిండి యిడినఁ
గైకొని, తా నొక్కఘటము సంపాదించి
పొందుగా నాసక్తు వందుఁ బోసి,
చేతి కందెడునట్టి చేరువ నాకుంభ
మమరంగఁ బ్రీతుఁడై యచటఁ బెట్టి,

గీ. సమధురోత్కృష్టభోజనోత్సవముకతన
నతఁడు సుఖసుప్తి నొందెడు నవసరమున,
నంతకంతకు దట్టమై యలమఁబడిన
గురుమనోరథ మంతయుఁ గోరుచుండి. ౧

(నారాయణ కవి)

వ. ఇట్లని తలపోయం బోడంగె. ౨

సీ. [3]అదన నీసక్తు వమ్మెద ; నమ్మి యొక మేఁక
గొనియెద ; గొనకొని కొనిన మంద

నేఁటేఁట నొక కెంటి నీనెడు నవియును;
నవియు వానికిఁ బుట్టినవియు నీన
బహువత్సరములకు బహుసహస్రంబు లై
నెగడెను; వాని నన్నింటి నమ్మి,
సంతరించెద ధేనుశత; మది పెట్టిన
కోడెలధనము చేఁ గొనినచేల
గీ. విరివిగాఁ బైరు వి త్తింతు; వేళ్లఁ గొలుచు
గాఁగ క్రమామకసస్యము ల్లడు ఫలించుఁ:
బంటకోలు చమ్మి కూర్తు నపారధనము;
ధనికుఁ డని నాకు నొకఁ డిచ్చుఁ దనకుమారి. 3

(వేంకటనాథుఁడు.)

వ. దానిని జేపట్టి పెద్దకాలము సంతతి లేకయుండఁ, ౪
గీ. పెక్కునోములు నోమంగ భీకహారిణి
నేత్ర గర్భంబు ధరియించి పుత్త్రుఁ గాంచె
వాఁడు నత్యంతసుకుమార వైభవమునఁ
జేసు సోమశర్మ యనంగఁ బెరుఁగుచుండె. ౫
చ. "పని 6తమకంబునఁ గృహిణి,
బాలకు నెత్తక యుండు టెట్లు నీ?"
వని 7భ్రుకుటీవికారవద
నాంబుజుఁ డై వసుధామరుండు తాఁ
దనకరమందు నున్న ఘన
దండముతో సతి నేయఁ, బిండి పె

ట్టిన కలశంబు భగ్న మగు
డుం, దెలివొందె ననంతరంబునఁ:

వ. ఇట్లు తనమనోరాజ్యంబు మిథ్య యగుటయు, సంపాదించిన పిండి నేలపా లగుటయుఁ దలంచుకొని చింతాక్రాంతుం డై యూరకుండెను.

—పంచతంత్రము - అసంప్రేక్ష్యకారిత్వము.

1 మహాలయపర్వదినముసఁ బెట్టుశ్రాద్ధమున. 2 ఇంకొకయింటి బ్రాహ్మణుఁడు. 3 యుక్తసమయమున. 4 ధాన్యము. 5 నాయొక్క. 6 త్వరచే. 7 బొమముడిచే.

## 9 సింహగార్ధభములకథ.

సీ. కలఁడు గ్రవనములోపల నొక్క మృగరాజు ;
గోమాయు వనికిఁ గూర్చు భృత్యుఁ
డై పంపుచేయఁగ, నమ్మృగేంద్రుఁడు జంబు
కముఁ జూచి పలికె దైన్యము దలిర్ప,
“అనఘ, మహోదరవ్యాధి నాతనువున
నొదవి యంతంతకు ముదురఁ జొచ్చె ;
ఘనగుణంబగు మందు లరసి సేవింపక
యూరకుండిన, మీఁద నొప్పకుండు ;
తే. గార్ధభము గుండె చెవులును గలిగె నేని,
యాపథంబున నది గూర్చి యారగించి
మచ్ఛరీరంబు రోగంబు మాన్పికొందుఁ ;
గానఁ గొనిరమ్ము ఖరము నాకడకు వేగ”

చ. అనిన, మహాప్రసాదమని
యమ్మృగధూర్తము పోయి రోయుచున్
జని, నగరోపకంఠమునఁ
జాకలవాని కృశాంగ గార్దభం
బును బొడగాంచి సద్వినయ
పూర్వముగా మృదుభాషణంబులన్
గనికరమొప్పఁ బల్కి యధి
కంబగు నేర్పున నాతఁడంబునన్. ౨

వ. ఎలయించి తెచ్చియిచ్చిన మృగనాథుండు, 3

గీ. ఉఱికి గార్దభంబు నుగ్రదంష్ట్రలు గల
ముఖమునం దుదగ్ర నఖములందు
నొత్తిపట్టి నపుడ యసువుపోయినదానిఁ
జూపి జంబుకంబుఁ జూచి పలికె. ౪

గీ. "దినముఖోచితకర్మంబు దీర్చి వచ్చి
యనుభవించెద నందాఁక నరసియుండు
మనుచు సింగంబు నదికిఁదా నరుగఁ జూచి
జంబుకంబు తలంచె మనంబులోన,— ౫

సీ. "దివ్యౌషధం బని తెప్పించి మృగరాజు
నన్నుఁ గావలిపెట్టి నదికిఁ బోయెఁ ;
నీవిందు మృగపతి కేల పోవంగనిత్తు ?
గ్రక్కున నటఁ దినెదఁ గాక మున్ను

భక్షించి నామేనఁ బరఁగు రోగము లెల్ల
హరియింతు ననుచు మహాభిలాష
మొదవ గార్దభకర్ణ హృదయంబులప్పుడ
తోడఁబడి తిని మూతి తుడిచికొనుచు,
తే. నంత హరివచ్చి, "యీగార్దభావయవము
లెక్కడికిఁబోయె సిపు ?" డన్న, నెఱుఁగనట్లు,
"మూర్ఖచిత్తున కెందైన మొదలఁగలవె
హృదయకర్ణంబు ? లది చూడ కెఱుఁగ కంటి. ౬
వ. కావున నీ గార్దభంబునకు హృదయకర్ణంబులు లే;" వనిన నట్లకాఁబోలు నని యామృగేంద్రుం డూరకుండె. ౭

—పంచతంత్రము, లబ్ధనాశము.

## 10 కపటవ్యాఘ్రము.

క. నర్మద దరి నిజహింసా
కర్మం బొరు లెఱుఁగకుండఁ గాఁపురముండున్
ధర్మమునఁ జరించు కపట
ధార్మిక మొక్కపులి యొక్కతరుకుంజమునన్. ౧
*ఆ. అడవిమృగము లెల్ల [1]నప్పుండరీక ధ
ర్మప్రవృత్తి సూచి, "రాజవగుము
మా," కటంచు వేఁడ, "నాకు హింసాధర్మ
దండనంపుసరణి తగదు గాన; ౨
*క. న్యాయాన్యాయ వివేచన
నేయుచుఁ దగినట్టిరీతి శిక్షించెద;" "నా

శ్రేయం బని సంతసమ్మున
వాయడవి మేకంబు లన్ని యది యొప్పకొనన్, ౩

క. ఒక్కయెడం, దమలో న్లోక
బొక్కకు శివాదడిచి శశకముఁ గపింజలముం
గ్రక్కునఁ బఱతెంచి పులిక
మ్రొక్కుచు నిజవాద మిరువురుం జెప్పటయున్, ౪

వ. ఆ వ్యాఘ్రంబు వానితోడ, ౫

తే. "ముదిసినారము, కానఁ మున్నువోలె;
శ్రవణముల దూరమును విను శక్తి లేదు;
కదియఁ జనుదెంచి చెప్పుఁడు కార్య;" మనుఁడు
నవియుఁ దేకువ మాలి డాయంగ నడుమ; ౬

క. ముందటి 3కాళ్ళం గొని యా
కుందేలుం 4గైదుఁ బట్టుకొని గొంతుక సం
దంద గఱచి భక్షించి య
తం డప్రీతిఁ బులి శౌర్యతత మై యుండెన్. ౭

—కేయూరబాహు II.

1 అపులియొక్క. 2 వాదాడి. 3 కాళ్లతోఁబట్టి. 4 కొంజు; కపింజలము.

## 11 కుక్కుర నీచత్వము.

సీ. విను మొక్కయితిహాస,—మనుపమం బగుతపం
బునఁ బేర్చువాఁ డొక్కమునివరేణ్యు
డాశ్రమంబునఁ దద్దయావిశేషంబున
నఖిలజంతువులును నచట నచట

వసియించి సుఖముండు; వానిలో నొక్క[1]ఋ
    ష్యుర మెప్డు భక్తిమైఁ గొలిచి తిరుగు;
నమ్ముని మెలఁగిన యచట నెల్లను దాను
    వర్తింప, నొక [2]దుప్పి వైరమెత్తి

తే. కలవ వచ్చిన నమ్మునికడకుఁ బాఱు
తెలిచె; నాకుక్క నాతఁడు దీప్తరూప
మైన దుప్పిఁగాఁ జేసిన, నది గడంగి
కలిమ, భయమంది పాఱె ముక్కవియు దుప్పి.

సీ. అట్లు బెబ్బులి వచ్చి యడరినఁ, బెబ్బులిఁ
    గాఁ జేసి గెలిపించెఁ గరుణ మెఱయ;
నొకమత్తకరిఁ జూచి యోటమై నొదిఁగిన,
    నుద్ధతకరిఁ జేసి యొసఁగె జయము;
సింహంబు వెస భీతిఁ జెంది పాఱ్తెంచిన,
    ఘనసింహముగఁ జేసి గర్వ మిచ్చె;
శరభంబుధాటికిఁ [3]జకితమైన, నుదగ్ర
    శరభంబుఁ జేసి యుత్సాహిఁ జేసె;

తే. నిట్లు దివసక్రమంబున నెక్కుడైన
[4]"సత్త్వమును జేయఁగాఁ, గుక్క శరభభావ
మందితం బయి తిరుగుచునుండి, పూర్వ
వాసనాసీచ మగుమనోవర్తనమున,

వ. ఇట్లని విచారించె,—

చ. [4]ననుఁ గని యొండుసత్త్వము మ
నంబున బెగ్గిలి పాఱునప్పు డి
మ్మునివర్యుఁ, డిట్లపోలెఁ గృప
[5]మెక్కుల మై, శరభంబుగాఁగఁ జే
యునో తగ దాని? న ట్లయిన
షుద్ధతి నాకుఁ జరింప లేదు ; గా
వున నితనిన్ వధింతు [6]వెర
వున్ బలమున్ సరి నుల్లసిల్లఁగన్". ౪

తే. అనువిచారంబు దివ్యబోధాఢ్యుఁ డైన
యమ్మునీశ్వరుఁ డెఱిఁగి, "యీయధమజాతి
యున్నతస్థితి యెఱుఁగునే? మున్నపోలెఁ
గుక్క యయి యుండుఁగా ;" కన్నఁ, గుక్క యయ్యె. ౫

—శాంతిపర్వము, III.

1 కుక్క. 2 చిఱుతపులి. 3 భయపడినదై కాఁగా. 4 మృగము. 5 అప్రతిహతము (మిక్కుట మని భావము). 6 ఉపాయము.

## 12 శీలప్రాభవము.

క. దనుజవిభుఁడు ప్రహ్లాదుం
[1]డనిమిషపతి రాజ్యలక్ష్మి యతులితశీలం
బునఁ గొని త్రైలోక్యంబును
దనకు వశగతంబు సేసె ధర్మం బలరన్. ౧

వ. బృహస్పతి భార్గవులయుపదేశంబున దేవేంద్రుఁడు బ్రాహ్మణ
రూపంబుగఁ బ్రహ్లాదునకి శిష్యవిధు లొనర్చుచుండి, ఒకనాఁ.

డతండు ప్రసన్నుం డై తనకుఁ ద్రైలోక్యరాజ్యంబు సంప్రా ప్తం బైనశీలకారణంబు దెలియం జెప్పిన, ౨

క. "ఘనమగు నీశీలము, నా
కనఘా, దయ నొసఁగవే; మహాత్ములఁ దగ నీ జెం
దినవారు బ్రదుక వలదే?"
యని దీనత వేఁడ ననిమిషాధిపుఁ డడిగెన్. ౩

క. విని ప్రహ్లాదుఁడు కృప దన
మనమునఁ గదురంగ, 'విప్రమాత్రుఁడు గాఁడీ
తని భంగిఁ జూడ," ననువెఱ
పును బుట్టఁగ, నిచ్చె శీలముం బెం పెసఁగన్. ౪

తే. పడసి యింద్రుండు శీలసంపన్నుఁ డగుచుఁ
జనియెఁ; దదనంతరంబ యద్దనుజవరుని
తనువునందుండి [2] తేజిష్ఠతనువిలాసుఁ
డైనపురుషుండు వెడలిన, నతఁడు సూచి, ౫

వ. "నీ వెవ్వండ?" వన, నప్పురుషుం, "డేను శీలంబ, నీ విచ్చిన యవ్విప్రుపాల వసియింపం జనియెద;" నని పోయెం; దద నంతరంబ క్రమంబునం దేజోమయరూపంబుల నలువురు నిజ దేహంబున నుండి నిర్గమింప నద్దానవేశ్వరుం డడుగుడు; ౬

క. ఉత్తమధర్మము, సత్యము,
వృత్తంబు, బలంబు నగుట వినఁబడెఁ; [3] బడిఁ, ద
చ్చిత్తము విషాద మంద, మ
హత్తర మూర్తి యొకవారి జూనన వెడలెన్. ౭

క. వెడలిన, "నీ వెవ్వత ?" వని
యడిగిన నాతనికి నిట్టులను దీనత న
ప్పడఁతి, "సిరి నేను ; బలి మె
క్కుడకు నరుగు, నందుఁ బోవఁ గడఁగి వెడలితిన్ ;" ౮

చ. అనిన భయంబు నొంది యతఁ
డాసతితోఁ, "బరమేశ్వరీ, మహా
వినయమతిన్ [4]ననుం గొలిచె
విప్రవరుం ; డతఁ డెవ్వఁ ?" డన్న, న
వ్వనిత, "సురాధినాథుఁడు, భవ
ద్ఘనరాజ్యవిభూతి యంతయుం
గొనుటకు నిన్నుఁ జెందె ; నిటు
గోల్పడి తీవును నీదుశీలమున్. ౯

వ. వినుము చెప్పెద. శీలంబున ధర్మంబు వెలయు ; ధర్మంబున సత్యంబు దొరకొను ; సత్యంబున వృత్తంబు సొప్పడు ; వృత్తంబున బలంబు వాటిల్లు ; బలంబున నేను గలుగుదుం ; గావున సమస్తంబునకు మూలంబు శీలం;" బని చెప్పి సిరి పురందరుపాలికి ధర్మాదులతోడఁ గూడం జనియె. ౧౦

—శాంతిపర్వము III.

1 ఇంద్రుఁడు. 2 అత్యంతతేజముగల. 3 వెంబడి. 4 నన్ను.

## 13 చోరరాక్షసుల కథ.

చ. ఘనసమ్మిగునగ్రహారమునఁ
గర్మవిదుం డొకబ్రాహ్మణుండు పా

వనచరితుండు గోవులఁ బ్ర
వర్ధన మొందఁగ రెంటి మేపఁగాఁ,
గనుఁగొని తాఁ బ్రమోదమునఁ
గైకొనఁగాఁ దఱి వేచి యుండు [1]మ్ర
[2]చ్చునిశము ; నొక్కనాఁ డొకమ
హానిశి నొక్కఁడుఁ బోవుచుండఁగన్,
గీ. [3] మొగులు సన్నపుఁజినుకుతో ముసురుకొనుట,
మీఁదఁ జీఁకటి దట్టమై మెండుకొనుట
మనుజరహితమును నిశామధ్య మగుటఁ
బొదలుమనమున నాదొంగ పోయి పోయి
సీ. ఎదురుగా నొక్కరుఁ డేఁగుదెంచిన, వానిఁ
దరలక చోయుండు దాఁకి బెదరి ;
"యెవ్వండ ?" వనుటయు, "నే బ్రహ్మరాక్షసుఁ
డను ; నన్నుఁ దాఁకినఘనుఁడ వైన
నీ వెవ్వఁ ?" డనుటయు, "నే మ్రుచ్చుఁ, బో ;" మ్మన,
"యింత ప్రొద్దెచ్చటి కేఁగె ?" దనిన,
"యీపురిలోన మహీసురోత్తము ధేను
వులు రెండు మంచివి గలుగఁ జూచి,
గీ. యపహరించుకొనుట కరిగెద నే ;" నన్న,
"నేను నతనిఁ బట్ట నిపుడు వత్తు,
ర ;" మ్మటంచుఁ గదలి బ్రహ్మరాక్షసుఁడును
నతఁడు నంతఁ గూడి యతనిగృహము,

వ. కదియం బోయి యమ్మహీదేవు గృహద్వారంబునొద్ద నిలిచి
చోరునిం జూచి బ్రహ్మరాక్షసుం డిట్లనియె, ౪

గీ. "ఏను మున్ను పోయి యీయింటివిప్రునిఁ
బట్టఁ భుక్తి నాకుఁ బెట్టఁ జూచి
పిదప నీవు గదిసి మొదవులఁ దోలుకో ;"
మ్మనిన నతనిమాట కాగ్రహించి, ౫

వ. చోరుం డిట్లనియె, ౬

ఆ. "తొలుత నీవు విప్రుఁ దెలిపిన, మఱి నాకుఁ
బట్ట నెట్టు వచ్చుఁ బసియుగంబు ?
వారు నతనిపొరుగువారును మేల్కన్నఁ,
బాఱ వలసియుండుఁ బసుల విడిచి ; ౭

క. చోరఁబడి గోయుగముం గొని
సరగున నే నూరు వెడలి చనునంతట భూ
సురు నీవు పట్టు;" మనుటయు,
నరుణాక్షులు మెఱయ నతఁడు నాతని కనియెన్. ౮

క. "పసుల మును నీవు దోలిన
ముసరిననెవ్వగల నతఁడు ముచ్చిరుచుండన్,
బస లేదు నాకుఁ బట్టఁగ ;
వెస నే మున్నరుగ నీవు వెనుచను;" మనియెన్. ౯

వ. ఇట్లయ్యిరువురు నప్పేరెలుంగునఁ గలహించుచుండ నక్కల
కలంబులను విని బ్రాహ్మణుండు మేల్కానియె; నప్పు డతనికి
విశ్వాసంబుఁ బుట్టింపఁ దలంచి, ౧౦

ఉత్సాహ. "వెస నితండు నిన్నుఁ బట్ట వేచి వచ్చె బ్రహ్మరా
క్షసుఁడు;" డటంచుఁ జోరుఁ డనినఁ [6]గనలి, "నీపశుద్వయం
బెసఁగువేడ్క వీఁడు వేగ నిపుడు వోల వచ్చె సా
హసికవర్యుఁ డితఁడు దొంగ;" యంచు రాక్షసుం డనెన్. ౧౧

తే. విని మహీసురవర్యుండు వితతమంత్ర
బలమునను బ్రహ్మరాక్షసుఁ బాఱఁదోలె
నంత, నటమున్న చోరుండు నరిగెఁ; గాన
బొసఁగ నహితులు దమలోనఁ బోర మేలు. ౧౨

—పంచతంత్రము, సంధి.

1 దొంగ, 2 అవకాశము=ఎల్లప్పుడు. 3 మబ్బు. 4 దుఃఖించుచుండఁగా. 5 పెద్దగొంతుతో. 6 కోపించి.

## 14 దీర్ఘదర్శిముఖ్యుల కథ.

వ. దీర్ఘదర్శియుఁ బ్రాప్తకాలజ్ఞుండును దీర్ఘసూత్రుండును నను మత్స్యంబులు మూఁడు జలచరబహుళం బగు నొక్కయేటి మడువునఁ దమలోనఁ బొందు గలిగి యుండు; వేసవి సొచ్చిన దీర్ఘదర్శి దక్కటి రెంటినిం గూడం బిలిచి,— ౧

క. "మడు వింకఁగఁ బాతెడు; నీ
[1]రెడ తెగ్విన, నొండుసోటి కేఁగఁగ రా; దె
ప్పుడు నింకనినీళ్లులు గల
మడువునకుం బోవ వలదె మన కిట్టియెడన్?" ౨

తే. అనినఁ బ్రాప్తకాలజ్ఞుఁ డిట్లనియె, "నేది
ప్రాప్తమయ్యె, నక్కార్యంబుభంగి నెఱిఁగి

యప్పటికిఁ దగినట్లు సేయంగ వలయు
మానితోపాయవృత్తి, నేమఱుట లేక." 3

వ. అనిన నయ్యుగ్రదెఱంగుల పలుకులు విని దీర్ఘసూత్రుం డిట్లనియె, ౪

క. [2]"జడనిధిచందంబున ని
మ్మడు వొప్పంగ, నిప్పు డేమి మాఁడిన దిమ్మై
[3]నడిచిపడ ? రిత్తనెవ్వగ
లుడుగుఁడు, మఱి చూచుకొంచ మొయ్యనఁ [4]-జెలితోఁ ;"

క. అనుటయును, "నిది [5]కర్జము గా;"
దని పల్కుచు దీర్ఘదర్శి యంబు[6]స్రోతో
జని తాభయ మగుపథమునఁ
జని చొచ్చెం బెద్దమడువు సమ్మదలీలన్. ౬

వ. తక్కిన రెండును నంద నిలిచె. కొన్ని దినంబులకు మడుఁ
గింకఁబాఱె జాలరులు వచ్చి [7]యొత్తెలపైచి మత్స్యంబులఁ
బట్టి సమకట్టినఁ, బ్రాప్తకాలజ్ఞుఁడు,— ౭

క. "ఇం దొకత్రాడున గఱచి యే
నొంచంగా గ్రుచ్చినట్ల యుండెద ; వీరి
క్రిందుకొనుట మానంగ న
మందత నది యెడల విడిచి మడుపు దఱిసెదన్." ౮

వ. అని యట్ల చేసి తప్పించికొనియె; మఱి, ౯

క. పట్టువడి దీర్ఘసూత్రుం
డిట్ట ట్టరుగఁగ నుపాయ మేది, యొకనిచేఁ

బట్టువడెఁ, దనదు డెందము
పట్టు వదలి చకితవికలభావేంద్రియుఁ డై ౧౦
—శాంతిపర్వము, 3 ఆశ్వా.

'దీర్ఘదర్శి' చాల ముందు చూపుగలవాఁడు. 'ప్రాప్తకాలజ్ఞుఁడు'—అప్పటికాలమెఱిఁగినవాఁడు; 'దీర్ఘసూత్రుఁడు'=అలసుఁడు. వీరలకు క్రమముగా అనాగతవిధాత, ప్రత్యుత్పన్నమతి, యద్భవిష్యుఁడు అని నామాంతరములు 1 విచ్చిన్నమైనచో. 2 సముద్రము. 3 త్వరపడక. 4 వలసినప్పుడు. 5 కార్యము. 6 ప్రవాహము. 7 చేపలఁబట్టెడియడ్డువల.

## 15 రంతిదేవుని చరిత్రము.

సీ. రంతిదేవుం డనురాజోత్తముఁడు మహా
దాతృత్వకీర్తితోఁ దనరుచుండు;
నా రాజు దనసంచితార్థంబు లన్నియు
నెడపక దీనుల కిచ్చి యిచ్చి,
సకుటుంబుఁ డై ధైర్యసంయుతుం డై పేద
యై కూడు నీరు లే కథమవృత్తి
నెం దేని నలువదియెనిమిదిదివసముల్
చరియింప, నొక 1దివసంబు రేపు

ఆ నెయ్యి, పాయసంబు నీరును గలిగిన,
బహుకుటుంబ భారభయముతోడ
నలసి, 2నీరువట్టు నాఁకలియును మిక్కి-
లొదవఁ జూచి కుడువ నుత్సహించె. ౧

వ అయ్యవసరంబున, ౨

సీ. అతిథి భూసురుఁ డొక్కఁ డాహార మడిగినఁ
గడపక ప్రియముతో గారవించి,
"హరి సమర్పణ;" మంచు నన్నంబులో సగ
మిచ్చిన, భుజియించి యేఁగె నాతఁ;
డంతలో నొకశూద్రుఁ డశనార్థి యై వచ్చి
పొడసూప లేదనఁ బోక, తనకు
నున్న యన్నములోన నొకభాగ మిచ్చిన,
సంతుష్టుఁ డై వాఁడు సనిన వెనుకఁ,
తే. కుక్క[3]గమియుఁ దాను నొక్కఁ డేతేర నా
యన్నశేష మిచ్చి, [4]సన్నయంబు
లాడి మ్రొక్కి పంప, నొకఁడ చండాలుఁ
డొక్కఁ డరుగుదెంచి, చక్క నిలిచి, 3

క. "హీనుఁడఁ, జండాలుండను;
మానవకులనాథ, దప్పి మానద ; యుపలం
బో నేర; నీకుఁ జిక్కిన
పానీయము నాకుఁ బోసి పంపఁగదవే." ౪

వ. అనిన వానిదీనాలాపంబులకుఁ గరుణించి. ౫

ఉ. "అన్నము లేదు ; కొన్ని మధు
రాంబువు లున్నవి, ప్రాణ మున్న ; ద
మ్మన్న ; శరీరధారులకు
నాపద వచ్చిన, వారి యాపదల్

గ్రన్నన మాన్చి వారికి సు
ఖంబులు సేయుట కన్న నొండు మే
లున్న దె? నాకు దిక్కు పురు
షోత్తముఁ డొక్కఁడె సుమ్ము, భూపుణ్యా." ౬

*క. అని కనికర మిగురొత్తఁగఁ
దన కున్న జలంబుఁ బోసెఁ దత్పాత్రమునకా
వనజాసనాదు లచ్చటఁ
గనుపట్టి నృపాలు కిడఁగఁ గైవల్యంబున్. ౭

—భాగవతము IX.

1 (ఒక) నాఁటి యందయము. 2 దప్పి. 3 గుంపు. 4 మంచి నీతులు 5 చండాలుఁడా. 6 మోక్షము.

## 16 శంఖలిఖితోపాఖ్యానము.

క. మును శంఖుండును లిఖితుం
డన నిరువురు విప్రవర్యు లన్నయుఁ, దమ్ముం
డును గలరు బాహుదాతీ
రనివాసులు ధర్మతత్పరమనోవృత్తుల్. ౧

సీ. వారి యాశ్రమముల భూరిపుష్పఫలాభి
వృద్ధి నొప్పారెడి వివిధభూరు
హంబులు గల; వొకయపుడు శంఖుండు గృ
హమ్మున లేకుండ, ననుజుఁ డచటి
కరిగి యం దొకమ్రాన 1నారఁ బండినపండ్లు
గని వేడ్కమైఁ గోసికొని తినంగ,

నయ్యన్న యేతెంచి, "మనుజ, యీఫలము లె
క్కడివియవి? చెప్పు;" నావుడు వినీతిఁ
తే. బ్రణతుఁడై, "యిచ్చటివి;" యని పలికె లిఖితుఁ;
డాతఁ, "డనుమతి లేక కోయంగఁ దగునె?
[2]ముచ్చిమియు కాదె యిది? పాప మచ్చుపడియె;
నృపతిచే దండితుండ నై [3]నీఁగి కొనుము." ౨
*మ. అన, సుద్యుమ్నసమాఖ్య నొప్పునృపు ధ
ర్మాత్ముఁ జేరె, "యో
మనుజేంద్రా, గురునాజ్ఞ లేక ఫలముల్
మందుండ నై గోసి నేఁ
డిని ముచ్చిలితిని; యుక్తదండవిధిచే
నిర్ముక్తపాపాత్ముఁ గాఁ
గ నను జేసి, [4]కృతాంతదండన విమో
క్షశ్రీయుతుం జేయవే." ౩
వ. అని లిఖితుండు పలుమఱు వేఁడుకొనఁగా, ౪
*తే ధర్మ [5]వైకల్యపాపంబు దన్నుఁ బొరయ
కుండ నిశ్చయ మొనరించి, దండనిపుణుఁ
డైన యారాజు లిఖితుని హస్తయుగ్మ
[6]కర్తనంబున దండితుఁగా నొనర్చె. ౫
వ. అంత లిఖితుండు రాజును దీవించి మరిగి చని శంఖునిం గని నికృత్తంబు లైనహస్తంబులు సూపి, "సమ్యగను భూతదని

డుండ నైతి;" ననిన నాతండు ప్రీతుండై చెంగటినదిం గ్రుంకి
ర మ్మనిన,

తే. బాహుదానదియం 7దవగాహనంబు
సేయం బ్రభవించె నాతనిచేతు లపుడ!
విస్మయం బంది యతండు వేవేగ వచ్చె
నన్న పాలికి, నతండుం బ్రహర్ష మొంద ౭

శాంతిపర్వము I.

1 పూర్తిగా. 2 దొంగతనమే. 3 నివృత్తిచేసి కొనుము. 4 యమదండన. 5 విచ్ఛేదమువలని. 6 కత్తిరించుటచే. 7 స్నానము.

## 17 రిత్తచలము.

క. ధరణిపయి లాటనరపతి
పురిం దేనియ నమ్ముకొొఱకు బోయలపల్లెం
జరియించుచుండువాం డొక
పురుషుం డది యొక్కకలశమునం గొని కడంకన్, ౧

వ. అరిగి యానగరంబున నొకసన్నపు వీథియందు, ౨

ఉ. తేనియకుండ మోచికొని
దిక్కులు నాలుగు [1]బిక్కచూడ్కిం దే
దేనియుం జూచుకొంచు, నొక
[2]యేనిక కట్టెదుటన్ మదాంధమై
రా నచటం దొలంగెడుపు
రంబుజనంబును జూచి భీతుండై

దానును సుత్తరించుచుఁ బ
దంబులు తొట్రుపడంగఁ బాఱుచుండ్. 3

తే. వడఁకుఁగొని నిలవఁ బోక్కనియడు గొంత
జాజే 3 మొగ్గత్తిలంబడఁ బాఱుటయును
నిండి మోఁవునఁ దాల్చినకుండ తోలఁక్
యొలికె మధుబిందు వొకకొంత యుర్విమీఁద.

సీ. ఆ తేనెబొట్టున కచట నీఁగలు ముసి
రిన, వానిఁ బట్టంగ నని కడంకఁ
జేరె నచ్చటి 4 చెలఁది; యా చెలఁది మ్రిం
గెను బల్లి; యొకపిల్లి దినియె దాని;
ఆ పిల్లిఁ గఱచె రాజాధీనమగు వేఁట
కుక్క యొక్కటి; దానిఁ గోపమడరఁ
బొడిచె బిడాలంబు 5 నోడయుఁడు; 6 నగరికు
క్కలవారు చంపిరి కడఁగి వాని;

ఆ. వాని 7 వాడవారు 8 బడిని జంపించిరి
కుక్కవేఁటకానిఁ ; గుక్కవేఁట
కాండ్రు రంద జేఁగి కత సవిస్తరముగా
నృపునితోడఁ జెప్ప, నృపతి యలిగి,

మ. తగ వూహింపక, యూరివాడ ప్రజలం
దాఁ జంపఁగాఁ బంచినన్,
"జగతీవల్లభుఁ డైన నేమి?" యని యు
త్సాహించి సన్నద్ధులై

నగరంగొల్వనివార లొక్కెడనై
నానాయుధోపేతులై
తెగి భూపాలకసేనఁ దాఁకిరి మహో
ద్రేకంబుతో నార్చుచున్. ౬

ఉ. రెండుతెఱంగు మూఁకలును
రిత్తకు రిత్త చలంబు పెంపునన్
భండన ముగ్రభంగుల నొ
నర్పఁగఁ బెక్కులు ద్రెళ్లెఁ బీనుఁగుల్;
కండలుఁ బ్రేవులుం గలసి
కాలువలై యొసలారె నెత్తురుల్;
కుండలచారుమస్తములు
గుప్పలుగట్టెఁ బురంబువీథులన్. ౭

—కేయూరబాహు II.

1 పేదచూపు. 2 ఏనుఁగు. 3 మోఁకటెల్లఁబడఁ బరుగెత్తఁగా, 4 సాలె పురుగు. 5 పిల్లి సొంతకాఁడు. 6 రాజగృహంపు. 7 వీథిజనులు. 8 వెంబడిసే.

## 18. 'పాముకన్న నరుఁడు పాతకుండు.'

క. భీకర మగువింధ్యాటవి
నేకలుఁ డనుబోయ తోఁట [1]యీరమున [2]మహా
నోకహముం దెగ నఱకఁగ,
నా [3]కోటరసీము నొక్కయహిపతి వెడలెన్. ౧

ఆ. వెడలి, "యేను నిలిచి విహరించుతా విది
వలదు; దీన నేమి కలదు నీకు?

నన్నుఁ గలసి బ్రదుకు ; మెన్నఁడుఁ జేటు లే ;"
యనిన వెరఁగుపడుచు నట్లు తలఁగె. ౨

క. తలఁగిన, వానికి నహి తన
తలరత్నం బిచ్చి పుచ్చి తా నేఁగిన, ని
మ్ముల వాఁడు నేఁగి పురిలో
పల నొకవర్తకున కమ్మెఁ బదిగద్దెలకున్. 3

చ. అట మఱునాఁడు వచ్చిన, మ
హాభుజగేంద్రుఁడు గారవించి, "ని
న్నఁటిమణి యెంత కమ్మితి వ
నా ?" యని, మూల్య మెఱుంగఁ దెల్ప, "య
క్కట ! పదివేల కమ్మక వి
కల్పము చేసితి ; వింతనుండి మి
క్కుటముగ నమ్ముకొ ;" మ్మనుచుఁ
గ్రొత్తఫణామణి నిచ్చె వానికిన్. ౪

క. తనయిల్లు గాచె నని యహి
మనమునఁ బ్రియ మంది యిచ్చుమణులను దినముం
గొనిపోయి యమ్ముకొనుచును
ధనికుం డై, వాఁడు చెల్మి దప్పినబుద్ధిన్. ౫

ఆ. "దీని కెచటఁ గల్గు దివ్యరత్నంబులు ?
దీని మొదలితావుఁ దెలియ వలయు ;"
ననుచుఁ గోరి పోయి, యాపాముచనుజాడ
పట్టి యేఁగి - యొక్కపుట్టఁ గనియె. ౬

క. కని తిరిగి పోయి, మఱునాఁ
డనలంబును గసవుమోపు హస్తంబులఁ గై
కొని వచ్చి తొఱ్ఱిలోపలఁ
జొనిపె, భుజంగంబు మిడుకుచు న్మడియంగన్. ౭

క. జాల్ముం డిటు గాలిచి యా
[7]వల్మీకముఁ ద్రవ్వఁ జనిన, వడి విషములచే
[8]గుల్మాదులు [9]దరికొనఁగా-
[10]నుల్ముకములభంగి- మఱియు నురగము లెగసెన్. ౮

ఆ. ఉరగకులము బోయఁ బొరిగొని శమియించె;
నట్లు గాకయున్న నదియుఁ [11]దగవె?
పాము క్రూర మంత్రు ప్రాణులలో నెల్లఁ;
బాముకంటె నరుఁడు పాతకుండు! ౯

—సింహాసనద్వాత్రింశిక I.

1 పొదరిల్లు. 2 పెద్దచెట్టు. 3 చెట్టుతొఱ్ఱ. 4 వరహాలకు. 5 భ్రాంతి తోవర్తించితివి. 6 పడగనున్నమణిని—శిరోమణిని. 7 పుట్ట. 8 తీఁగల గుంపు. 9 మండఁగా. 10 కొఱవులవలె. 11 ధర్మమా?

## 19. వైశ్యబాలికప్రజ్ఞ.

క. కాంచీపురమున నొకరుఁడు
కాంచనగుప్తుఁ డనుబుద్ధిగలవైశ్యుఁ, డని
ర్వాంచనుఁడు సుతున కరయం
బంచెం బరిణయముసేయ బాలిక నొకతెన్. ౧

చ. పనిచినవారు వైశ్యకుల
బాలలఁ జూచుచు—నప్పురాంగణం
బున నొక[1] క్రేవ నొక్కరుఁడు
మూటెఁడు [2]ప్రాలకు నూనె సంతలోఁ
గొనెఁ జనుదెంచి, 'బియ్యము
నకుఁ సరి తైలము వోయు;' మన్న, నా
తనిపలు కెవ్వరుఁ వినక
తద్దయు నవ్వుచు గేలి సేయుచుఁ; ౨

క. "ప్రా లేఁడుమాని కలకుం
దైలము మానెండు పురము [3]దారణ గలుగన్,
బ్రాలసరి తైల మడిగిన
జాలియ యగుఁ గాని, నీకుఁ జను రే లబ్బున్?" 3

క. అని పలుక, మఱియు నడుగం
గని, యచ్చట నున్నవైశ్యకన్య యొకర్తె యా
తనిఁ జీరి, "కలదు నూనియ,
కొనియెదవే, నమ్ము ప్రాలకును సరిలెక్కన్." ౪

వ అని పలికి, చేరవచ్చిన మూట దింపించి, బియ్యంబు లెన్ని యవిగాఁ జూచి, వానితో మఱియు ని ట్లనియె. ౫

క. "ప్రా లొక్కటఁ గొని, దానన
తైలము దిగువాఱఁ బోయుదానను; నీకుం
బోలినఁ, బ్రాలం గొలువుము;
కాలము నీతోడఁ బిదప జగడము లాడన్." ౬

వ. అనుపల్కులకు వాఁడొడంబడుటయు; ౭

ఆ. పళ్లెరంబుఁ దెచ్చి, పటుబుద్ధి బియ్యంబు
దానినిండఁ గొని, ముదంబుతోడ
నంద వోసెఁ దైల మంచులు దిగువాఱ;—
నవ్విధంబు మెచ్చు నావహింప. ౮

క. ఛని కాంచనగుప్తునకున్
వినిపించిరి యతనివారు వేగమ; యతఁ డం
దునఁ దద్బుద్ధివిశేషము
గొనియాడుచు, దానిఁ దనదుకోడలిఁ జేసెన్. ౯

—కేయూర బాహు I

1 పార్శ్వమున. 2 బియ్యమునకు. 3 వెల.

## 20. గర్గుని బుద్ధిమాంద్యము.

క. గర్గుఁ డనువిప్రుఁ డొకరుఁడు
దుర్గారాధనముఁ, బెక్కు [1]వొసఁగులఁ బడుచున్
దుర్గాటవిలోఁ జేయ, ని
ర్గళదయఁ దన్నుఁ జూచి యాయంబికయున్. ౧

క. వరమడుగు మనిన మ్రొక్కుచు
సరభస మగుకాంక్షతోడ, "సంజీవని ని
ర్భరకరుణన్ నా కొసఁగుము
పరమేశ్వరి;" యనినఁ, గొన్ని పచ్చనియాకుల్, ౨

చ. తలఁచినమాత్ర నాత్మకర
తామరసంబున నున్నవాని, ని

ష్ములఁ [2]గృపసేసి, 'పీనిరస
ముం బయిపైఁ జిలికింపఁగా శవ
మ్ములకును బ్రాణముల్ గలిగి
ముంచ్పటిరూపము వచ్చి తేజముం
బలమును జెంది పూర్వగుణ
భంగిఁ జరించుట కల్లు నెల్లెడన్. 3

క. "ఎండవు, తఱుఁగ ;" వనుచు సిడి
చండిక పొడగానరాక చనుటయు, మదిలో
నిండిన సంతసమున వి
ప్రుం డవి కొని, యాత్మపురముత్రోవ నొకరుఁడున్. ర

చ. చనునెడ, నిర్మనుష్య మగు
చక్కటి నప్పెనుకాన నెండిపో
యిన యొక [3]పుండరీకశవ
[4]మీారము వెల్పల నున్నఁ, జేరఁగాఁ
జని తనకన్న యౌషధము
శక్తి నిజంబుగఁ జూడ నెంచి, చే
త నలిపి యాకులం బసను
దానిపయిం బిడిచెన్ గుబుద్ధియై. ౫

చ. పిడిచిన, నేమి చెప్ప ? నతి
భీకరదుస్సహపుండరీక మ
ప్పుడు తననిద్ర మేల్కనిన
పోలిక మోగుచు బిట్టు లేచి య

వ్వేడఁగగువిప్రుఁగూయిడఁగఁ
జేసి మృతుం బొనరించి మ్రింగె; మే
ల్వడసియు బుద్ధి చాలనియ
భాగ్యులు తత్ఫల మంద నేర్తురే! ౬

—కేయూరబాహు II.

1 ఇడుములు. 2 ఇచ్చి. 3 పులి. 4 పొదరిల్లు.

## 21 సాపాయోపాయము.

మ. ఒక [1]కాసారతటంబునందు నొర పై
యున్నట్టివృక్షంబుపై
బకయుగ్మంబు వసింప, భార్య పురుషుం
బ్రార్థించె, "నోనాథ, య
ర్భకరాజిం దినిపోవుఁ గ్రిందఁగలస
ర్పం; బేపుమై నింక న
చ్చిక నేతెంచుఁ; బ్రసూతికాలమును వ
చ్చెం; గార్య మెట్లుండునో! ౧

వ. అనిన విని బకవిభుం డమ్మహీరుహంబు డిగ్గి కొలనితీరంబున నిల్చి విచారించుసమయంబున నయ్యెడకు నొక్క [2]కుళీరంబు చనుదెంచి, "యిది యేమి దుఃఖాకులుండ వై యున్నవాఁడ?" వనిన, నబ్బకం బిట్లనియె, ౨

ఉ. "నాకులకాంత గర్భ మయి
నందనులం గనునంతలోన, [3]ద
ర్వీకర మేఁగుదెంచి తిని

వేగమ పోయెడు ; [4]నెల్లి నేఁటిలో
-నాకలకంఠి వెండియును
నర్భకులం గనువేళ గాన, నే
నాకులతం దలంకెద, మ
దాత్మకు నేమియుఁ దోఁప కుండఁగన్. 3

వ. అనినఁ [5]గర్కటకంబు నీకుం దగినయుపాయంబు చెప్పెద
విను మని యి ట్లనియె,— ౪

తే. "[6]నకులవివరంబునందుండి నాగవిభుని
యునికిదాఁకను మీనంబు నొకటి నొకటి
వైచుకొని పోవ, నాముంగి వరుసఁ దినుచుఁ
బాముఁ జంపును ; దీని కుపాయ మిదియె" ౫

వ. అన విని బకం బట్లు చేసిన, ౬

ఆ. [7]కవుచుగాలి పాఱ, [8]గవిఁ బాసి వెలువడి
వరుస మీలఁ దినుచు వచ్చి వచ్చి,
పాముఁ జంపి, పాదపముఁ బ్రాఁకి బకశిశు
ప్రకరభుక్తిఁ దనిసి, నకుల మరిగె. ౭

—పంచతంత్రము-మిత్రభేదము.

1 సరస్సు. 2,5 ఎండ్రకాయ. 3 పాము. 4 రేపో, యీఁదినమో.
6 ముంగిస బొరియ. 7 చేఁపమీఁదిపొలసు. 8 గుహ-ఇచ్చట బొరియ.

## 22 ఫలద్వయము.

ద్విపద,—

"ముద్దులమాంచాల, ముదమున వినుము,—
జన్మవృక్షమునకుఁ జవి గలయట్టి

[1]పటుతరకమనీయఫలములు రెండు ;
కెరలుభోగము లొండు, కీర్తి రెండవది ;
తొలుపండు చవిచూచి తొలఁగు నొకండు ;
మలుపండు చవిచూచి [2]మలఁగు నొకండు ;
వీరలిద్దఱికిని భేదంబు హెచ్చు :
[3]మొదటిఫలంబున మొనసెడురసము
క్షణభంగురం ; బది సమసిపోఁ గలదు ;
రెండవఫలమున రెక్కొనురసము
శాశ్వతం బౌచు—దిశల్ గలదాఁక,
సవితృఁడు గలదాఁక, శశి గలదాఁక,
తారలు గలదాఁక, ధర గలదాఁక,
వారిధి గలదాఁక వరలుచు నుండుఁ ;
బ్రకటఫలద్వయరసమును గ్రోలి
యనుభవించెడివార లరుదు భూస్థలిని ;
[4]ప్రాకృతజనములు ప్రథమఫలంబుఁ
బ్రాపించి సంతృప్తి వడయంగఁ గలరు ;
వీరాంశమునఁ బుట్టి వెలయువారలకు
మొదటిఫలం బది ముఖ్యంబు గాదు ;
మహిమాస్పదం బయి మనసు జ్వలింపఁ
బరుగెత్తుదురు రెండవఫలంబుకొఱకు.
వెలఁదిరో, నీభర్త వీరశేఖరుఁడు,
కీర్తికాముకుఁ డయి [5]కోరుచున్నాఁడు ;

నీవు భోగములపై 6విరతిఁ ద్యజించి
బాలచంద్రునిమనోభావం బెఱింగి,
భావిమానవుల హృద్భవనంబులందుఁ
7దావకీనయశోలతావివర్ధనము
సేయఁగఁ గోరుము ; చెలువరో, యిపుడు,
"బాలచంద్రుని నాఁగఁబట్టంగ వలదు ;" ౩౦
అని యట్లు రేఖాంబ యానతీయంగ,
జననికిఁ దా నమస్కారంబు చేసి
వీరపత్ని మఱి ధీర మాంచాల
భర్త వీడ్కొల్పంగ భక్తితో నేఁగె.

—పలునాటివీరచరిత్ర.

1 మిక్కిలియందమైన. 2 తిరుగును. 3 సూర్యుఁడు. 4 పావురులు. 5 ఉత్సహించుచున్నాఁడు. 6 ప్రీతి. 7 నీదైన.

## 23 ముసలాఖ్యానము.

క. ద్వారవతికిఁ గన్గొండుచు
నారదమునివరుఁడు 1గాధినందనుఁడును బెం
పారంగఁ దొల్లి వచ్చిరి
నారాయణుఁ జూచువేడ్క నరవరముఖ్యా. ౧

సీ. చనుదెంచి పురవీథిఁ జనునవసరమున
2వృష్ణికుమారులు విధివశమున
మనవమ్ముల నవినీతి జనియింప సాంబున
కంగనాలంకార మమరఁ జేసి

కొనివచ్చి, యమ్మహామునివర్గమునకు ౩మిం
థ్యావినయమున వందన మొనర్చి,
నిభృతు లై, "కారుణ్యనియతాత్ములార, యీ
భామిని బభ్రునిభార్య; ⁴ప్రజలఁ
తే. గనునె యిది ?" యని యడుగ నాయనలసదృశు,
లా తపోధనవర్యు లయ్యాగడమున
కాత్మలందుఁ గ్రోధానల మగ్గలముగ
నెలయ, నక్కుమారులతోడ నిట్టు లనిరి. ౨
క. "అంబుజనాభునికొడు కీ
సాంబుఁడు గను యాదవక్షయాంపాదన ౫క
ల్యాం బగుముసలము ; మావచ
నంబున కనృతంబు లేదు ; నమ్ముఁడు మీరల్. 3
సీ దామోదరుఁడు హలధరుఁడును దక్కంగ
యాదవు లెల్లను నమ్ముసలము
నద్భుతశక్తి గీటడఁగుదు ; రబ్బల
దేవుండు దనదైనదేహ మధిక
నిష్ఠమై విడిచి వార్నిధిఁ బ్రవేశించు ; భూ
శయ్య నుండంగ నాచక్రధరుని
జర యనురాకసి వెరవునఁ బట్టి క్ర
మించు ; బోం ;"డని చెప్పి, "మెచ్చు గాదు
ఆ మనము కృష్ణు నింకఁ గను ;" టనియెడిబుద్ధి
నమ్మహామునీంద్రు లపుడు మరలి

యాత్మవాసములకు నరిగిరి; మఱునాఁడుం
బుట్టె సాంబుగర్భమున ముసలము. ౪

—మాసలపర్వము.

1 విశ్వామిత్రుఁడు. 2 యాదవులు. 3 కల్లవిషయము. 4 బిడ్డలను. 5 సమర్థ...

## 24 వింధ్యాచలనిగ్రహము.

ఉ. నెమ్మి నిసుంతు మేరుధర
ణీధరనాథుఁ బ్రదక్షిణంబుగాఁ
ద్రిమ్మరుచున్నఁ జూచి [1]పటు
దీధితికిం గరమల్గి వింధ్యశై
లమ్మనియెన్, "దినేంద్ర, యచ
లప్రభు నన్నుఁ బ్రదక్షిణంబు ని
త్యమ్మును జేయ కేల మతి
దప్పితి? మేరువుఁ గొల్వ నేటికిన్? ౧

వ. అని గర్వించి పలికిన నప్పర్వతంబునకు భానుం డిట్లనియె,—

క. "అనవరతము [2]విధి యోగం
బున నేఁ ద్రిమ్మరుదు నమరభూధరముఁ బ్రియ
మ్మున; నాత్మేచ్ఛ యొనర్పఁగఁ
జన;" దనవుడు నలిగి వింధ్యశైలం బంతన్. ౨

క. ఇనశశితారాదులకుం
జూరాకుండంగఁ బెరిఁగి [3]జలధరపథ మె

ల్లను గప్పి యుండె వింధ్యం
బ నుపమ ముత్తుంగ మై సురాద్రిస్పర్ధన్. ౪

క. రవిశశిగతు లుడుగుడు, 'నిది
దివ, మిదిరాత్రి ;' యని వసుమతీజనులకు నన
ద్దివిజ మునివరుల కెఱుఁగఁగ
[5]నవగాఢం బయ్యె, నంధ మయ్యె జగంబుల్. ౫

వ. ఇట్లు పెరిఁగిన వింధ్యంబునొద్దకు వచ్చి వేల్పు లెల్ల దాని వర్ధనంబు వారింప నోపక యగస్త్యుపాలికిం జని వింధ్యంబు పెక్కువ యెఱింగించి యిట్లనిరి,— ౬

క. "భువనవ్యవహారమునకు
వ్యవధానం బయ్యె వింధ్యవర్ధనమున ; న
ద్దివసకర రజనికర గతు
[6]లవిహత మగునట్లు సేయు మమరమునీంద్రా. ౭

వ. అని దేవతలు ప్రార్థించిన నగస్త్యుండు లోపాముద్రాసహితుండై వింధ్యంబుసమీపంబునకు వచ్చి దానిచేఁ బూజితుండై యిట్లనియె,— ౮

క. "చనియెద దక్షిణదిశ కే ;
నొనరఁగఁ దెరువిమ్ము. నాకు నుర్వీధర, నీ ;"
వనవుడు, "నట్లుల చేయుదు,"
నని పెరుఁగుట యుడిగి వింధ్య మతివినయముతోన్, ౯

వ. [7]"భట్టారకా, విజయంచేయుం," డని భూమిసమాన మైయున్న దాని కగస్త్యుం డిట్లనియె,— ౧౦

క. "నా మగుడివచ్చునంతకు
భూమీధర, యీప్రకారమున నుండుము ; నా
తో మైత్రిఁ జేయు ;" మని లో
పాముద్రాధీశ్వరుండు పలికె ముదమునన్. ౧౧

వ. దాని నొడంబఱిచి దక్షిణదిశకుం జని లోకంబులకు హితం
బుగా నంద యుండెె. వింధ్యంబు [illegible] నోడియున్నది. ౧౧

—అరణ్యపర్వము III.

1 సూర్యునకు. 2 బ్రహ్మాయాజ్ఞను, నియతిప్రకారము. 3 మేఘమార్గము - ఆకాశము. 4 దేవతలకును మునిశ్రేష్ఠులకును. 5 మిక్కిలియెత్తైనది అశక్యమనుట. 6 అవిచ్ఛిన్నమగునట్లు. 7 పూజ్యుఁడా.

## 25 స్వామిభక్తి.

క. మును కాశీశ్వరుదేశం
బున నొకలుబ్ధకుఁడు వేఁటవోయినచోటన్
ఘనతర 1విషదిగ్ధశరం
బున నేసిన, మృగముఁ దప్పి భూజముఁ దాఁకెన్. ౧

క. పువ్వులఁ గాయలఁ బెరిఁగిన
యావృక్షము శుష్కమయ్యె నవ్విధమున ; ధా
త్రీవర, తదీయ 2కోటర
మావాసముగాఁగ నొకమహాశుక ముండెన్. ౨

క. అది తరువు విడిచి పోవక
హృదయంబున భక్తిపేర్మి నెండను గాలిన్
బెదరక 3ధృతిమై నయ్యెడఁ
దలఁక యుండె 4ననుజీవిగౌరవ మెసఁగన్. ౩

ఉ. దాని యుదాత్తవృత్తము 5శ
తక్రతుఁ డాత్మ నెఱింగి వచ్చి, "బెం
డైనది యిమ్మహీజము ; మ
హాతరువుల్ ఫలవృద్ధి నొందు యి
క్కాన ననేకముల్ గలుగఁ
గా, నిటు లేఁటికి నిందు నిల్వ నో
మానితకీరమా ?" యనియె
6మానుషభంగికరూప మొప్పఁగన్. ౪
వ. అనిన విని యాశుకంబు, ౫.
చ. 7"అనయముఁ బండు చుండు నెడ
నాశ్రయ మొప్పిన నిల్చి, యెండిపో
యినతఱిఁ బాసి 8పోవ తగ
వెట్లు ? కృతఘ్నత కాదె యివ్విధం
బనిమిషనాథ ?" యన్న నతఁ
డచ్చెరు వంది, "9పురాకృతోపసం
జనితవిశేష, మీఖగము
జానుగ నన్ను నెఱింగె ; దీనికిన్ ౬
వ. మే లొనర్చెదంగాక ;" ౭
క. అని తలఁచి, "నీదుపలుకులు
విని మెచ్చితి ; వరము గోరు విహగోత్తమ, నీ ;"
వనిన శుకము మహీజం
బునకుం బేరెలమి వేఁడె, భూపవరేణ్యా, ౮

ఆ. అమరవల్లభుండు నమృతసేచనమున
భూజమునకుఁ దొంటిపొల్పుకంటె
మిగుల నెలమి సేసె; మేలియాశ్రితు లిట్టి
మనుతు రధిపు; మేలు మఱవ రెపుడు. ౯

—ఆనుశాసనికపర్వము I.

1 విషము పూయఁబడినబాణము. 2 చెట్టులొట్ట. 3 ధైర్యములో. 4 ఆశ్రితునిగొల్పుతనము 5 ఇంద్రుఁడు. 6 నరాకృతి. 7 సదా. 8 పోవుట. 9 పూర్వపుణ్యముచేఁగలిగింపఁబడినయతిశయముగలది.

## 26 విమతిసేవ.

క. మందరపురమునధీశుఁడు
మందప్రజ్ఞుండు దుష్టమతి తనప్రజలన్
దుందుడుకుచేష్టలన్ గడుఁ
గ్రందగుకష్టములపాలు గా నొనరించున్. ౧

సీ. ఎలుకవేఁటలపేర నేఁగి [1]పట్టణము వోఁ
బ్రజలయిండ్లు కూలఁ ద్రవ్వఁ బంపుఁ;
జెలఁగి డేగలకుఁ దొండల నేయఁ బోయి ప్రా
క్షామంటపంబులు గాసిసేయుఁ;
గోడిపోరులపేర వాడలఁ దిరుగుచుఁ
బాడఁగన్నకడవలఁ బొలియ వైచు;
వేఁటకుక్కలఁ దెచ్చి విడిచి మందలలోని
మేఁకల కుసికొల్పి మెచ్చి యార్చుఁ;

తే. గాలకింకరులట్టికింకరులు తోడఁ
గూడి రాఁ, గూడి ప్రొద్దును గూడుఁ దొరఁగి,
పెడఁగుఁదనముఁ బ్రల్లదమును వేనవేలు
మదముతోఁ జేయు రాజకుమారుఁ డిట్లు.

క. అనవపతి యనువుగ నొక
2వానరపోతంబుఁ దెచ్చి వాత్సల్యముతోఁ
దానిఁ బెనిచి, యాయుధవి
ద్యానిపుణతఁ బొందఁ జేసి, యది వర్ధిలుచున్

క. 3కంచుకము దొడిగి కుండల
చంచ 4త్కటకాదిభూషచయ మిడి 5శితఖ
డ్గాంచితరూపముతోఁ దన
6కంచుకి యై యుండఁ బనిచెఁ గదలక యెపుడున్

వ. ఇట్లుండ నతం డొకనాఁడు,

తే. సుప్తుఁ డగుచుండి వానరుఁ జూచి, 'నన్ను,
డాయ వచ్చినజీవుల వ్రేయు ఖడ్గ
ధారఁ దునియంగ, నని చెప్పి కూరె నిద్రఁ;
గపియుఁ బనిపూని భూపతిఁ గొలిచి యుండె;

వ. ఆసమయంబున,

మ. 7సుమనోదామము రాజుకంధరమునన్
శోభిల్ల నత్తావికై
భ్రమరం బొక్కటి మూఁగ, దానిఁ గని కో
పవ్యగ్రమై క్రొఁతి ఖ

ద్గమున న్వేసినఁ, దేఁటితోన ధరణీ
కాంతావతంసంబుకం
ఠము రెం డయ్యె; [8] వినీతుఁ డైన [9] పతిచే
ష్టల్ చేటు దేకుండునే? ౭

—కేయూరబాహు III.

1 పట్టణమునఁ శింపఁగా. 2 క్రోఁతిపిల్ల. 3 పెద్దలాగు [కంచుకులు పెద్ద లాగుధరింతురు. "అన్తః కఞ్చుకికఞ్చుకస్య విశతి త్రాసా దయం వామనః." రత్నావళీనాటిక II] 4 వాస్త్రాభరణములు మున్నగుసొమ్ములుపెట్టి. 5 కదనైన. 6 అంతఃపురపాలకుఁడు. 7 పూలదండ. 8 నీతిరహితుఁడు. 9 రాజుయొక్క

## 27 అహిమూషికోపాఖ్యానము.

*క. క్రూరోరగదమనుం డను
పేరిటి [1] యహితుండికుండు వింధ్యాటవిలో
ఘోరం మగునొక్కసర్ప మ
భీరుండై పట్టి యొక్కపెట్టియఁ బెట్టెన్: ౧

తే. పెట్టి, దానికి నెరగాఁగఁ బట్టి యొక్క
మూషకము వైచి, పెట్టిను మున్న వోలెఁ
గట్టి డించిన, నురగంబు గఱచరాఁగ
నెలుక బెదరక దానితో నిట్టు లనియె,— ౨

క. "నీ కుపకారము నేసెద;
నా కభయం బిచ్చి కావు; నాకార్యంబున్
నీకార్యంబును మే లై
పోటులు, నాతోడఁ జెలిమి చేసితి వేనిన్ ౩

ఆ. వాఁడు పట్టినపుడ వానిచే నైనను
జావవలయు ; నాకుఁ జావు నిజము ;
చచ్చియున్న నన్నుఁ జంపి, చావనినీకుఁ
జెలియ యుండఁదలఁచు టెఱుక యగునె ?

క. ఏ నధికబలుఁడ ; నాచేఁ
గానిది యీయెలుకచేతఁ గా నోపెడునే ?
తా నాచెఱ యేవిధమున
మానుచు ? నిది కల్ల ;" యనుచు మదిఁ దలఁపకుమీ.

క. నాచెప్పినట్లు చేసిన
నీచెఱ విడు ; నట్లుగాక నిలు పోపక నీ
వే చంపి నన్ను నోరను
వైచికొనిన మానునే భవత్[2]క్షు త్తెల్లన్ ?"

క. అనవుడు నురగము సంతస
మున నాఖువుతోడ, "స్వప్నమున నైనను నీ
డొనరింప ; నీవు నాచెలి ;
ననుమానము దక్కి నమ్ము మానందముతోన్.

వ. [3]ఇక్కరండనిగ్రహ మెట్టుడిపెద వుడుపు ;" మనుటయు,

క. "ఏ నొకమంత్రము నీతల
పై నుండి జపించి, జపము వారించి తగం
గా నినుఁ బిలిచెదఁ, గదలక
నీ నయనయుగంబు మూసి నిలు మందాఁకన్."

చ. అని నియమించి దానిశిర
 [4]మంజక యొక్క కరండనిగ్రహం
బనువుగఁ ద్రోసి యాఖు వది
 యప్పుడ పోగాఁ ; ననంతరంబు లో
చనములు విచ్చి చూచి మది
 సంతసమూనె వగవుం దలిర్ప నా
[5]కనుమన దాను నేఁగి భుజ
 గం బొకబొక్క వసించి, యాత్మలోన్, ౧౦

క. "ఎలుక కపటమున నాక
స్నులు ప్రామెను ; మ్రింగ లేక ; [6]నో రెరియఁ గటా !
తొలఁగెద ; నిఁ కేటి బ్రదు ?" కని
తలఁచె ; దురాత్ములకు నెందుఁ [7]దగవులు గలవే ? ౧౧

—కేయూరబాహు IV.

1 పాములవాఁడు. 2 ఆఁకలి. 3 పెట్టెచెఱ. 4 భయపడక. 5 సందు నన. 6 నోరుమండఁగా. 7 ధర్మములు.

## 28. శ్రీ కృష్ణుని దుడుకు చేతలు.

వ. గోపికలు యశోదకడకు వచ్చి యిట్లనిరి,– ౧

క. బాలురకుఁ బాలు లే వని
బాలెంతలు మొఱలు వెట్టఁ బకపక నగి, యీ
బాలుం డాలము సేయుచు
నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ. ౨

క. పడఁతి! నీబిడ్డఁడు మా
కడవలలో నున్న మంచి కాఁగినపా లా

పడుచులకుఁ బోసి, చిక్కిన
కడవలఁ బో నడిచె ; నాజ్ఞ గలదో లేదో ?

క. మీాపాపఁడు మాగృహముల
[2]నాపోవఁగఁ బాలు ద్రావ నగపడకున్నన్,
గోపించి పిన్న పడుచుల
వాపోవఁగఁ జిమ్ముకొనుచు వచ్చెం దల్లీ. ౪

మత్త. పుట్టిపుట్టఁడు, నేఁడు దొంగిలఁ బోయి మాయిలు సొచ్చి తా
నుట్టి యందక ఱోలుఁ బీఁటలు నొక్కప్రో విడి యెక్కి చే
వెట్టఁ జాలక కుండ క్రిం దొక పెద్దతూఁ టొనరించి, మీా
పట్టి మీాఁగడ పాలుఁ జేరలఁ బట్టి త్రావెఁ దలోదరీ. ౫

క. ఆడం జని వీరల పెరుఁ
గోడక నీసుతుఁడు ద్రావి యొకయించుక తాఁ
గోడలి మూతిం జమిరినఁ,
గోడలు [3]మ్రొచ్చనుచు నత్త గొట్టె లతాంగీ ౬

క. వారిల్లు సొచ్చి కడవలఁ
దోరం బగునెయ్యి ద్రావి, తుది నాకడవల్
వీరింట నీసుతుం డిడఁ,
వారికి వీరికిని దొడ్డవా దయ్యె సతీ. ౭

క. "వేలుపులకు ! నాకంటెను
వేలుపు మఱి యెవ్వఁ ?" డనుచు వికవిక నగి మా
వేలుపులగోడపై నో
హేలావతి, నీతనూజుఁ డెంగిలి చేసెన్. ౮

ఆ. నమ్మి నిదుర వోవ నాపట్టి చుంచు మా
లేఁగతోఁకతోడ లీలఁ గట్టి,
వీథులందుఁ దోలె; వెలఁది, నీకొమరుండు,
రాచబిడ్డఁ డైన అవ్వ మేలె?

క. నాపట్టి పొట్ట నిండఁగఁ
బైపడి నీపట్టి వెన్న బానెం డిడ, నాఁ
డూపిరి వెడలదు; వానిం
జూపెద; నే మైన నీవ చుమ్మి లతాంగి. ౧౦

సీ. కలకంఠి, మావాడ గరితల మెల్ల నీ
పట్టి రాఁగలఁ డని పాలు పెరుఁగు
లిండ్లలోపల నిడి యే మెల్లఁ దనత్రోవఁ
జూచుచో, నెప్పుడు సొచ్చినాఁడొ!
తలుపులముద్రలుఁ దాళంబులును బెట్టి
యున్న చందంబున నున్న వరయ;
నొకయింటిలో నాడు, నొకయింటిలోఁ బాడు,
నొకయింటిలో నవ్వు, నొకటఁ దిట్టు,

ఆ. నొకట వెక్కిరించు, నొక్కొకచో మృగ
పక్షిఘోషణములు పరఁగఁ జేయు;
నిట్లు సేసి వెనుక నెక్కడఁ బోవునో
కానరాఁడు, రిత్తకడవ లుండు. ౧౧

క. కడు లచ్చి గలిగె నేనిం,
గుడుతురు, గట్టుదురుగాక, కొడుకుల నగుచున్

⁵బడుగులవాడలపైఁ బడ
విడుతురె రాకాంత లెందు విమలేందుముఖీ? ౧౨

క ఓయమ్మ, నీకుమారుఁడు
మాయిండ్లను బాలుఁ బెరుఁగు మననీఁ డమ్మా;
పోయెద మెక్కడి కైనను;
మాయన్నల ⁶సురభులాన మంజులవాణీ. ౧3

—భాగవతము-దశమస్కంధము.

1 జగడము. 2 తనియఁగా. 3 దొంగ. 4 పిల్లజుట్టు. 5 అశక్తుల. 6 ఆవులు.

## 29. పవనశాల్మలీతరుసంవాదము.

తే. "బూరువా, యింతపఱపును బొడవుఁ గల్గి
నీవు మృగపక్షిసంశ్రయణీయ మగుచు
నునికిఁ గని ప్రీతి నడిగెద; ననిలుచేతఁ
బడు నొకప్పుడు తరులు, నీపడమి యెట్లు? ౧

క. "పవనునకును నీకును బాం
ధవము గలదొ? యతఁడు నిన్ను దయ రక్షింపన్,
సవినయవృత్తిని బ్రదికితొ?
చెవులకు నింపెసఁగ నిజము సెప్పుము నాకున్." ౨

వ. అని హిమవంతంబునందుఁ బెద్దకాలంబునుండివరలునొక్క శాల్మలీమహీజంబును జూచి నారదమునీంద్రుఁ డడిగెను.

క. అని యడుగ, బూరు వి ట్లను,—
"అనిలునిబల మస్మదీయ మైనబలముతో

1నెన గా ; ద్రౌపద విను, పదు
నెనిమిది యగునంశమునకు నెనయ దరయఁగన్." ౪

వ. అని పలుకుటయు నమ్మునీంద్రుం డను, ౫

ఆ. "అమ్మచెల్ల! యిట్టు లనకుము ; కొండలు
లోనుగాఁగఁ బవనుచే 2నవా స్త
మహిమము లగు టెఱుఁగుమా ; భూతములచేష్టి
తములు వాయువశగతములు గావె ? ౬

క. అనుటయుఁ 3బెలుచని మొలుఁగున,
"ఘనమూలప్రబలశాఖకాండుఁడయు న
న్నును దాఁకిన నతని4ప్రభం
జనుఁ డనునామంబునకు నసత్యత వచ్చున్." ౭

వ. అని గర్వంపుమాట లాడినయాశాల్మలిం జూచి సురముని
ప్రవరుండు,— ౮

చ. "మఱవక యుండు నీబిరుదు
మాటలు ; నీ విటు లంట మారుతుం
డెఱిఁగెడు నెట్లు ;" నంచు వెస
నేఁగి సమస్తముఁ జెప్ప నాతఁడే
డ్డైఱఁ జనుదెంచి, "నీవటె క
డిందిమగండవు ? నిన్నుఁ దాఁకినం
జెఱుతటె పేరు ! బూరుగ, న
శించితిగా కిట పల్కు లేటికిన్ ?" ౯

మ. అని కోపంబునఁ బల్కి నప్పవనుతో
నాభూరుహం బింత పె
ల్చన, "నీ వాఁడెదునంత తక్కువనె? జే
ల్వా లోకసామాన్యవ్య
క్తుని కాయంబును నన్ను నొక్కటిగ ని
చ్చం జూచితే" యన్న న
ల్లనిన వ్వొప్పఁగ నాసమీరణుఁడు [6]హే
లాస్ఫారుఁ డై యిట్లనున్. ౧౦

క. "ఒకనాఁ [7]డజుండు నీనీ
డకు [8]డబ్బా టరుగుదెంచుటయు, నమ్మేలా
త్మకుఁ బ్రేఁగ్గి మన్నించిన
[9]మెకమెకపడి; యిట్లు పలుకుమీ తగ రేపున్." ౧౧

వ. అని పలికి బలు మొగంబుతోడం బోయిన, నబ్భూరుహ దలంకి,

చ. "మనుగడ దప్పునొక్కో ? ముని
మాటలు గైకొన నైతి; నాబలం
బన నది యెంత ? యుగ్రత మ
హాబలురాకకు నోర్వఁ జాల; నా
తని నొకభంగి గెల్తు;" నని
తాఁ దఱిపోసి హరించె నాకులుం
గొనలును జొంపముల్ నిడుద
కొమ్మలు రే యగుదున్ రయంబునన్. ౧౨

వ. అట్లు తన్నుం దాన విఱుచుకొని యున్నంత, ౧౩

చ. "ప్రతినకు నీడు గా భయద
భంగిఁ బ్రభంజనుఁ డేఁగుదెంచి యా
తిరుహాముం గనుంగొని, "యి
సీ! యిది నాపని నీవ చేసి; తే
[10]ధృతి కిఁక సంతసింపు; మిటు
తేజముఁ బొందుము; నీదుబాంధవ
ప్రతతికి నివ్విధంబునను
పాయము మే లెఱిఁగింపు పెంపునన్." ౧౪

వ. అని యుల్లసం బాడి యా[11]సదాగతి సనియె; నట్లు శాల్మలి పవనుచేత భంగంబు నొంది వగం గుందెను. ౧౫.

—శాంతిపర్వము, III.

1 సమానము. 2 పోఁగొట్టఁబడిన. 3 పెద్దదైనకంఠముతో. 4 వాయువు (వ్యు. వృక్షశాఖాదులను విఱుగఁగొట్టువాఁడు.) 5 పరాక్రమముతో. 6 విలాసాతిశయముతో. 7 బ్రహ్మ. 8 అకస్మాత్తుగా. 9 ఉద్ధతినొందితివి. 10 ధైర్యమునకు. 11 వాయువు.

## 30 కపిలాఖ్యానము.

సీ. దేవత లాఁకొని దేవతాజ్యేష్ఠునిఁ
గానంగఁ బోవ, నాకమలజన్ముఁ
డమృత మిచ్చిన, ముద మారఁగా ద్రావఁ ద
[1]త్సురభిత్వసంపద [2]సురభి పుట్టె;
నది [3]సౌరభేయుల నవని నుత్పాదించె;
నొకయప్డు హిమగిరియుపరితల మ

లంకరించుచు నవి శంక యించుక లేక
యున్నెడ, వానిలో నొకటి లేఁగ
తే. చన్ను గుడువఁ దదాస్యనిష్యందమాన
మైన 4దుగ్ధఫేనము పవమాననిహతిఁ
దూలి దప ముగ్రముగఁ జేయుశూలిమౌళిఁ
బడినఁ దద్దేవుఁ డధికకోపంబు గదుర.
క. 5చిచ్చులక న్నదరఁగ వే
విచ్చినఁ 6గపిలత్వ మొందె 7విబుధప్రకరం
బచ్చెరు వందుచుఁ గన్గొన
నచ్చెరువపార ఖేయు లమలచరిత్రా.
క. అవి బిట్టు బెదరఁ, దక్కటి
యవియు నదరె బెదరె ; నిట్టు లగ్గోవులు వా
తె వెసను సోమునిపాలికి ;
నది యంతయుఁ దా నెఱింగి యజుఁ డేతెంచెన్.
సీ. ఏతెంచి 8నిభృతిమై ఁ ధీశ్వరచరణాంబు
జములకు నెఱఁగి, హస్తములు మొగిచి,
"యమృతసిక్తుఁడ వైతి ; వఖలేశ, గోవుల
కెంగిలి లే ; దిందుఁ డెట్టు లమృత
మొసఁగు, నట్టుల గోవు లొసఁగు దుగ్ధంబులఁ ;
దద్వత్స9పీతదుగ్ధంబు శుచియ ;
శాంత కోపము దక్కి కరుణింపు ;" మని యొక్క
కమనీయవృషభంబుఁ గప్పమిచ్చె ;

తే. శివుఁడు ప్రియమంది దానిఁ గేతువుగను వాహ
నంబుగాఁ జేసి, సకలజనంబు నెలమి
వృషభకేతనుఁ డనియును వృషభవాహ
నుం డనియుఁ బేర్కొనఁగ నొప్పి యుండు జగతి. ౫

వ. ఇట్లు ప్రసన్నుం డయి తనచూపునం గపిల లయినగోవులకుం దక్కినవర్ణంబులగోవులకంటె నుత్తమత్వంబు గలుగ వరం బిచ్చి విరించిని వీడ్కొలిపె. ౬

—ఆనుశాసనికపర్వము III.

1 పరిమళాతిశయముచేత. 2 కామధేనువు. 3 ఆవులను. 4 పాల నురుఁగు. 5 అగ్నికన్ను (మూఁడవకన్ను). 6 గోరోజనమువంటి రంగుకలుగుటను. 7 దేవసమూహము. 8 వినయముతో. 8 త్రావఁబడిన పాలు.

## 31 శశవిజయము.

* క. తొల్లి పదిరెండు[1] శరదము
లెల్లెడ వఱపొందె; సరము లింకెను; ప్రాణుల్
దల్లడమందెను; మనుగడ
కల్లగఁ గన్పట్టె నొక్కకాంతారమునన్. ౧

* క. కరియూథ మొండు తమదా
సర మెండఁగ, [3]నీరుపట్టు సైఁపగ భరమై
సరభసరీతిని నెల్లెడ
నరయుచుఁ, దుది నొక్కమడుఁగు నతిహర్షమునన్. ౨

వ. కని యందుఁ జొచ్చిన, 3

తే. అట్టిసంరంభగమనంబునందు నందుఁ
గల శశంబులు తత్పాదఘట్టనమున

ప్రుంది మృతిఁ బొందుటయుఁ, జింత నొంది శశక
నాయకుండు శిలీముఖనామఁ డపుడు, ౪

వ. గజంబు లచ్చోటు వాసి చనునుపాయం బూహించి, ౫

ఆ. కదలిపోయి చంద్ర5కాసారమున కెంతొ
చెంత నున్న శైలశిఖర మెక్కి
నిక్కి, "యోగజేంద్ర, నీకు నేమమె?" యన్నఁ
దొండ మెత్తి చూచి కొండమీఁదు. ౬

వ. "నీ వెవ్వండవు? ఎచటినుండి నీ వేమికార్యంబున కిట వచ్చి
తివి?" యని యూథపతి యడిగిన నా శశపతి యి ట్లనియె. ౭

తే. "6ఓషధులఁ బ్రోచి, జీవుల నుద్ధరించు
7కైరవాప్తునిదూత; నిక్కడకు నన్ను
నతఁడు పుత్తెర వచ్చితి; 8నవితథముగఁ
బ్రభుని 9కార్యార్థ మే నిదె పల్కువాఁడ. ౮

క. ఈకొలను చంద్రుపేరన్
బ్రాకటముగ మున్ను కలిగె; బహుపక్షికుల
10వ్యాకీర్ణతటమహీజ
శ్రీ కన్గొని పొగడుచుండ్రు సిద్ధులు దీనిన్. ౯

క. ఇందులకున్ గావలిగాఁ
బొందుగ మ మ్మునిచినాఁడు 11బుధజనకుఁడు మ;
మ్మిందఱను మట్టి చంపితి;
రిందునితో వైరపడఁగ నెంతటివారల్? ౧౦

క. శశికిఁ వంశ్యుల మగుటను
శశకము లనఁ బరఁగి ధాత్రిఁ జరియింతుము ; క
ర్కశహృదయులార, మీ కిఁక
వశ మగునే నిలువ ?"—నని వారణ మనియెన్. ౧౧

క. "ఈతెఱఁ గెఱుఁగక వచ్చితి ;
మీ తెరువున నడవ మింక ; నేఁగెద మిదె ; మీ
రీత పోర్వఁగఁ దగు ;" నని
[12]మాతంగపుఁ డచటు వాసె మదగజములతోన్. ౧౨

వ. అనంతరము శశకంబులు చంద్రకాసారంబున సుఖముండెను.

—పంచతంత్రము, సంధి.

1 సంవత్సరములు. 2 అనావృష్టి. 3 దప్పి. 4 మందేళ్లు. 5 సరస్సు. 6 మందుచెట్లులు. 7 చంద్రుఁడు. 8 నిజముగా. 9 కార్యరీతిని. 10 మిక్కిలి నిండియున్న తీరవృక్షశోభ. 11 చంద్రుఁడు. 12 గజరాజు.

## 32 హంసము లు.

క. కాంచనపక్షం బగురా
యంచం గనుఁగొని నృపాలుఁ డనురాగముతో
"వంచించి పట్టుకొనియెద ;"
నంచుఁ దలఁచె దైవఘటన కనుకూలముగాన్. ౧

వ. ఇట్లు పట్టుకొని దానిబంగరుఱెక్కలరూపసంపద కద్భుతం బంది చూచునలమహారాజున కారాయంచ మనుజభాషల నిట్లనియె, ౨

క. "ఱెక్కలకొనలం గలిగిన
యిక్కాంచన మాసపడియెదే నృప ? నే కే

యక్కట దీనం దీరెడు
నక్కట! 1నీహారకణిక నబ్ధికిఁ బోల్చెన్? ౩

చ ఎఱుఁగనె నీవు ప్రాంతమున
నింతటనంతట నుక్కి; యింత యే
మఱుకనె? నిన్ను విశ్వజన
మాన్యుఁడ వంచును విశ్వసించి యి
త్తఱి సుఖనిద్రఁ బొందితి వృ
థామతి; 2నెట్టన యాత్మ నమ్మినం
జెఱుపఁ దలంతురే ఘనులు
చిత్తమునన్ బగవారి నేనియున్? ౪

ఉ హింసయ నీకు వేడ్క యగు
నేని, గృహాశ్రయమైన యీ సరో
హంసముఁ జంప నేల? కఱ
వా 3తరువాత వసుంధరాధిపో
త్తంస, విజృంభమాణభుజ
దర్పనిరంకుశసాహసక్రియా
4మాంసలచిత్తవృత్తు లయి
మత్తిలి యుండు నరాతిభూపతుల్? ౫

వ ఫలకుసుమమూలమాత్రంబున శరీరయాత్ర నడపుచు, మునులుంబోలె, సలిలంబులలోనం దపంబు సేయుచున్నారము. మామీఁద దండనీతి ప్రయోగింప నీకుం దగునె? యదియుంగాక,

ఉ

సీ. తల్లి మదేకపుత్త్రక, పెద్ద, కన్నులు
గానదు విప్పుడు ; మూఁడుకాళ్ల ముసలి ;
యిల్లాలు గడు సాధ్వి, యేమియు నెఱుఁగదు,
పరమపాతివ్రత్య భవ్యచరిత ;
వెనుక ముందఱ లేరు నెనరైనచుట్టాలు ;'
5లేవడి యెంతేని జీవనంబు ;
గానక కన్న సంతానంబు శిశువులు ;
జీవనస్థితి కేన 6తానలంబు ;
తే. కృపఁ దలంపఁగదయ్య యోనృపవరేణ్య ;
యభయ మీవయ్య యో7తుహినాంశువంశ ;
కావఁగదవయ్య యర్థార్థికల్పశాఖి,
8నిగ్రహింపకువయ్య, యోనిషధరాజ." ౭

వ. అని విలాపంబు సేయుచు దృగ్గోళకంబుల వేఁడికన్నీరు వెడల గోలుగోలున నేడ్చినం గృపాళుం డై యాభూపాలుండు హస్తపల్లవంబులు వదలి, "రాజహంసంబ, పొమ్ము, సుఖంబుండు ;" మని విడిచిపుచ్చెను. ౮

—శృంగారనైషధము. ౧ ఆశ్వా.

1 చిన్నమంచుబొట్టుచేత సముద్రమునకుంబోలె. 2 మిక్కిలి. 3 ఆవల. 4 పొగరుగొనిన మనోవృత్తులుగలవారయి. 5 పేదఱికము. 6 ఆధారము. 7 చంద్రవంశమువాఁడా. 8 దండింపకుము.

## 33 శుకీయుక్తి.

చ. ఒకనైను గానలో నొకమ
హోన్నతభూజమునందు బాలశా

ఖరేముల [1]నస్ఫుటా ప్రబల
పక్షములం గలవానిఁ బ్రోచికొం
చొకశుకి యుండు ; న త్తరువు
నొద్దన చిక్కనివెల్లమ్రానియం
దొక [2]ఫణినాయకుండు గర
ళోల్బణుఁ డుండును [3]గోటరంబునన్. ౧

వ. ఇ ట్లుండ నొకనాఁడు బోయ యొకండు తనపిల్లలఁ జంపఁ జె ట్టెక్కినఁ, జిలుక వెలఁది జాలిమెయి నతనితో ని ట్లనియె,

క. "అన్నన్న ! లేవె పక్షులు ?
కన్నులు తెఱవనివి తిన్నఁ గలదే చవి ? వే
[4]మన్నిగొన నేల ? విడువఁగ
దన్న ; యకట ! చంపఁ గూడునయ్య శిశువులన్ ?" 3

చ. అనవుడు బోయ యి ట్లను శు
కాంగనతోఁ, "నడలంగ నేల ? నీ
తనయులఁ జంప నేను ; [5]బిసి
తంబులు [6]బ్రాఁతియె నాకు ? వీనిఁ గై
కొని వెలవెట్టువారికడ
కుం జని యమ్ముదు ; [7]పిల్చి వారునున్
పెనుతురుగాని, వీని కొక
పీడ యొనర్పరు ; నమ్ము నెమ్మదిన్. ౪

క. అనవుడు దానికిఁ గీరాం
గన, "సంపంగ నొల్ల వేని, గనకముపైఁ గాం

ఘన పట్టి తేని, విడు నా
తనయుల; నీ కేసు జూపెదను హేమంబుల్. ౫

మ. ప్రకటశ్రీయుతుఁడొక్కఁడీయడవిలోఁ
బాటచ్చరశ్రేణిబా
ధకు నుల్లంబున నోడి యున్న తనయ
ర్థం బొక్కచోఁ డాఁచెఁ; ద
ప్పక యేఁ జూచితి; నున్న దాపసీఁడి; చూ
పం జాలుదుల్; నన్నుఁ బు
త్రకులన్ గాచెద నెల్ల నాఁడు నని వం
తం బాపి రక్షింపుమా." ౬

మ. అనినన్ బెన్నిధి యప్పుడే కనినయ
ట్లానందముం బొంది, "యే
నిను నమ్మించుదు;" నంచు [9]శాబకముల
[10]న్నీడంబులోఁ బెట్టి, చ
య్యన భూమీజము డిగ్గి బోయ నియతుం
డై యొక్కచో నిల్చి, యు
ర్లను బోనుల్ నెస ముట్టి నమ్మఁ దగుప
ల్కుల్ వల్కె నిర్వంచనన్. ౭

వ అప్పుడు కీరవనిత వానితో ని ట్లనియె. ౮

క. "నమ్మిక లవి యేమిటికిం?
[1]గ్రమ్మఱ వచ్చెదవె నీవు? ఖగమృగబహుదుః

ఖమ్ములకును నాచూపెడు
సొమ్ములపైఁ జేయి వెట్టి సుఖివైనతుదిన్." ౯

వ. అని పలికి యిదె ర మ్మని తోడ్కొని చని, ౧౦

గీ. [11]పూనుఁగాఁడియంతభుజగంబు లో నున్న
వెలఁగ మ్రాని వెడఁదతొలట సూపి
"దీనఁ జేయి వెట్టు ; లోన నున్నది సవి
శేష హేమ ;" మనుచుఁ బలుక చెప్పె. ౧౧

ఉ. చెప్పిన, వెట్టిబోయ [12]వల
చే యటు సొన్పుడు, నందుఁ గన్నులన్
నిప్పులు రాలుచున్న మహా
నీయగరోజ్జ్వల భీషణోరగం
[13]బుప్పలవాయిఁ దిన్న, విష
ముగ్రత నెక్కుడు, దృష్టిజీకటుల్
గప్పఁగ, నోరఁ బెన్నురువు
గ్రమ్మ, మృతుం డయి కూలె మేదినిన్. ౧౨

—కేయూరబాహు, IV.

1 లెస్సగా పోటమరింపని బలములేని ఱెక్కలుగలవానిని. 2 పాముల ఱేఁడు. 3 చెట్టుతొఱ్ఱలో. 4 చంపనేల? 5 మాంసములు. 6 అరుదా? 7 కాని. 8 దొంగగుంపుయొక్క. 9 పిల్లల. 10 గూటిలో. 11 ఎద్దులు అఱ్ఱుపైఁదాలుచు నట్టి కాఁడి ప్రమాణముదైన. 12 కుడిచేయి. 13 బొట్టన జుట్టన వ్రేళ్ల నడుము.

## 34 గరుడుని పరాజయము.

క. అంబుధితీరంబునఁ గూ
ర్మంబులు చరియించుచుండుఁ; బ్రతిదినమును వా
నిం బట్టి తనకు నాహా
రంబుగఁ గొనుచుండుఁ బక్షిరా జుగ్రుం డై. ౧

వ. ఇట్లుండ నొక్కనాఁడు,— ౨

చ. వననిధినీట నిల్చి ఖగ
వల్లభుతో నొకకూర్మముఖ్యుఁ డి
ట్లనియె, "మదీయబంధునివ
హంబులు దేవర వాతఁ ద్రుంగె; నే
న నిలిచినాఁడ; నిప్పటికి
నాకుఁ దొలంగినఁ బోదు; నీకు నా
కు నొకటి పన్నిదంబు సమ
కూఱునె? యోలము మాని చెప్పుమా." 3

క. అనుటయు నవ్వుచు 1వినతా
తనయుం, "డది యేమి పన్నిదము? సెప్పవయా;"
యనవుడు, "నలుగక చిత్తం
బున నించుక యవధరింపుము, మహావిహగా ౪

మ. 2ఉడువీథిఁ వెస నీవు వాఱి, జవస
త్త్వోత్సాహా, యంభోధిలోఁ
గడవం బాఱెద; నిన్ను నేను మిగులం
గాఁ జాలిన క్లైన, నె

న్నఁడు భక్షింపకు మమ్ము ; నోడినటులై
నం, మాకులం బెల్ల నె
ప్పుడు నాహారముగొమ్ము నీవు వినతా
పుత్త్రా, మహాధార్మికా. ౫

వ. ఇవ్విధంబు సేయం దలంపు గలిగెనే నొక్కనాఁ డిచటికి
విజయంచేయుం ;" డనియె. ఖగరా జొడంబడి పోయె ; న
దెల్ల తనచుట్టంబులతోఁ జెప్పి కూర్మవల్లభుఁడు వారలతో
ని ట్లనియె,— ౬

క. "ఆమటి యెడఁ బది పది గా
సాముద్రతటంబునీరఁ జని యుండి, ఖగ
స్వామి పఱవంగ, నాతని
కాముందటివాఁడు చూపునది [3]పొడ వచటన్." ౭

*క. అని యనుకొని పతగాధిపు
ననిపినయెడఁ గూర్మవిభుఁడు నట్టులె యుంటఁ, ద
క్కిన వది మొదలుగ బహుయో
జనములవఱ కంతనంతఁ జక్కఁగ నిలిచెన్. ౮

వ. మఱునాఁడు [4]సమయప్రకారంబు సనుదెంచి, ౯

క. గరుడుం డవ్వేలనిక్కిన
త్వరగతిఁ గూర్మంబుఁ బిలిచి, వారిధిపైనం
బరవీథిఁ బెద్దయును ద
వ్వరుగుచు, నది చిక్క నోపు నని [5]చీరుటయున్. ౧౦

క. "ఓ యని పలుకుచు ముందఱ
దోయధిలోఁ గచ్ఛపంబు తోఁచిన, మఱియుం
వాయుగతిఁ బఱచి చేరిన,
నాయెడ నగ్రమునఁ గరుత న్మల్లన నెగసెన్. ౧౧

వ. అప్పథంబుఁ గని యచ్చెరువొందుచు, ౧౨

క. అందుండి మఱియుఁ బఱచుచు
ముందఱ నెట్టెట్ట పలువ, ముందఱ నంతం
తం దోఁచుచు, నగ పిలుఁదులు
ముందఱఁగాఁ జేసి పక్షిముఖ్యుని గెలిచెన్. ౧౩

క. అతఁ డటు బతుఁ డౌటను ల
జ్జితుఁడై మీ కెంత నెగ్గు సేయం; [6]బ్రమద
స్థితి నిలువుఁ" డనుచుఁ బోయిన
నతిసంతోషమునఁ గచ్ఛపావళి యుండెన్. ౧౪

—కేయూరబాహు. III.

1 గరుత్మంతుఁడు. 2 ఆకాశమున. 3 పొడవుసూపునది = పొడసూపునది—కనఁబడునది. 4 ఒడంబడికచొప్పున. 5 పిలువఁగా. 6 సంతోషముతో.

## 35 సిరియాళుని యాత్మస్థైర్యము.

[ఒజ్జయింట విద్య నభ్యసించుచున్న సిరియాళునియొద్దకు తన్మది చలింపఁజేయుకుతూహలంబున జటాధారి యై జంగమ రూపంబున పరమశివుం డేఁగుదెంచెను. అప్పుడు,]

తే. ఆ[1]జటాధారి చేరంగ నరుగుదెంచి,
తనకు సాష్టాంగ మెఱఁగి తాత్పర్య మెసఁగఁ

గేలుదమ్ములు మోగియించి [2]కెలన నున్న
చిన్నిముద్దులసిరియాళసెట్టి కనియె.

శా. "అన్నా, యీచిఱుతొండనంబి యనుపా
పాత్ముండు మీతండ్రియే?
యన్నిర్భాగ్యుఁడు జోగి కొక్కరునికై
[3]హాలామదోన్మాదికై
నిన్నుం జంపి [4]మహోపహారముగ వం
డింపంగ నున్నాఁడు; సం
పన్నస్నేహముతోడ నీకు నెఱిఁగిం
పన్ వచ్చితిం జెచ్చెరన్. 2

క. కడుపునఁ బుట్టినకూరిమి
కొడుకున్, సుకుమారమూర్తిఁ, గులవర్ధనునిన్,
మెడ గోసి చంపి [5]నంజుడుఁ
గుడుపుల జోగులకుఁ బెట్టుక్రూరులు గలరే? 3

తే. దానవుఁడు గాక వాఁ డేటితండ్రి? చెప్పుము;
చెక్కు గీఁటిన వస వల్చు చిఱుతవాని
మత్తుఁ డొక్కఁడు మధుపానమత్తుఁ డగుచు
నిన్ను వేఁడినఁ జంపఁగ నిశ్చయించె. 4

వ. [6]"జీవన్ భద్రాణి పశ్యతి', యను వేదవచనం బవలంబించి యెక్కడికేనిం బోయి యీబాధం దప్పించుకొనుట నీకుం గర్తవ్యంబు." 5

## 36 సేతుబంధనము.

*క. రెండవవారాశివలెన్
మెండగుకపిసేన వారినిధితీరమునం
దుండ; న[1]కుంఠితమార్గణ
మండితుఁ డగు రాముఁ డనియె మర్కటవిభుతోన్.

క. "మనబల మిది యతిబహుళము ;
వననిధియును దుస్తరంబు ; వానరవర, యి
వ్వననిధిఁ గడచునుపాయము
మన కొక్కటి నిశ్చయింపుమా తగుబుద్ధిన్." ౨

తే. అని విచారించునెడఁ గొంద ఱధిపుఁ జూచి
[2]జడధి బలితంపుఁదెప్పలఁ గడత మనిరి ;
ఘనపుఁ [3]గలములు సమకట్టి కడత మనిరి ;
కొంద; ఱంతయు విని రఘునందనుండు. 3

సీ. అల్లన నగుచు ని ట్లనియె, "మీచెప్పుటల్
దగినయుపాయంబు లగున యయిన
నగ్గణితం బైనయీహరిసైన్యముల కెల్లఁ
గలములుఁ దెప్పలు వలయునన్ని
సమకట్టు టరయ నశక్యంబు, శతయోజ
నంబులపరపైనయంబురాశిఁ
గలములఁ దెప్పలఁ గడచుచో రిపుకోటి
యెడరునఁ బైఁ బడి పొడువ కున్నె ?

ఆ. అదియుఁ గాక యల్పు లగువణిగ్జనముల
యోజ శూరతతికిఁ దేజ మగునె?
కాన నాదుమతము గా; దివ్విధంబు నా
మనసునిశ్చయంబు వినుఁడు మీఁదు. ౮

చ. వ్రతము ధరించి నిష్ఠ నుప
వాసవిధిన్ గొలుతున్ సముద్రు; నా
కితఁడు ప్రియంబుతోడఁ దెరు
విచ్చుట యంతన కల్గ నేని మే;
లితరునిఁగాఁ దనుం దలఁచె
నేని, యమానుషరోషవేషదీ
పితశరవహ్ని నిజ్జలముఁ
బీల్చెదఁ; బ్రేల్చెద నొక్క ప్రేల్మిడిన్." ౯

వ. అని పలికి దశరథసూనుండు దానును దమ్ముండును నుపవ
సించి దర్భశయనులై జలధీంద్రు నుపాసించుచున్నంత
సముద్రుండు పొడసూపి తన్నిశ్చయం బెఱింగి యిట్లనియె

సీ. "జననాథ, నీకార్యమునకు నే విఘ్నంబు
గావింప నోపుదు నేవిధమున;
వినుము నావాక్యంబు: జను లెల్ల నెఱుఁగ నే
కిత్తరి దెప్పు విత్తు నేని యింక
నిల నెల్లవాఁడును విలసితదివ్యాస్త్ర
బలమున సాధింపఁ దలఁచు నన్ను;

మీ యందుఁ గపివీరుఁ డాయతమతి విశ్వ
కర్మసూనుఁడు శిల్పకర్మవిదుఁడు

ఆ. నలుఁడు నాఁగ నొకఁడు గలఁడు; వాఁడొలసి నా
యందుఁ దరులు గిరులు నొంద వైవ,
నవి ధరింతు నేను దివిరి; నీ వది సేతు
వుగఁ గడంక నరిగి పగఱ గెలుము." ౬

వ. అని యతని నొడంబఱిచి సముద్రుండు పోవుటయుఁ, దదుపదిష్ట మార్గంబున నలుండు శతయోజనాయామంబును దశయోజనవిస్తారంబును గా నతిదృఢం బగు సేతుబంధనంబు నిర్మించెను. సాగరోత్తరణం బాచరించి కపిసేనావాహంబు త్రికూటంబు నధివసించెను. ౭

—అరణ్యపర్వము, VII.

1 ముక్కువోనిబాణముల నలంకృతుండైనట్టి. 2 సముద్రమును. 3 ఓడలు. 4 చిటికెలో.

## 37. కర్ణుని దానప్రాభవము.

సీ. వనమున నప్పాండుతనయు లుండఁగ నందు
పదుసంబండ్రెండగు వత్సరంబు
కడపట నింద్రుఁడు గడఁగి పాండవహిత
కారియై కర్ణునికవచకుండ
లములు మాయాప్రయోగమున హరింపంగఁ
దలఁచిన, నాతనితలఁ బెఱింగి
బాలార్కుఁ డొకనాఁడు వెలయు రాధేయున
కది యెల్ల నెఱిఁగింతు నని తలంచి

న్నత మై యొప్పు మదీయకీర్తి ; యిది సూ
నాపుణ్య మెబ్భంగులన్. ౪

ఆ. కీర్తి విడువఁ జాలఁ ; గీర్తితో మెలఁగంగఁ
జావు వచ్చెనేని, జత్తుఁ గాని ;
జగములోన నెల్ల [6]'సడికంటెఁ జావు మే'
లనఁగఁ బరఁగుమాట యనఘ, వినవె ? ౫

ఉ. 'కీర్తియ యిచ్చుఁ బుణ్యగతిఁ ;
గీర్తియ తల్లియుఁ బోలెఁ బ్రోచు ; స
త్కీర్తియ యాయువున్ సిరియుఁ ;
గీర్తివిహీనుఁడ చూ శవంబు ; దు
ష్కీర్తను నెల్లచేటులును
[7]గిట్టి హరించు' ననండె తొల్లి భ
క్తార్తిహరుండు నాఁ బరగు
నంబుజసూతి జగద్ధితంబుగన్. ౬

సీ. విప్రులు గడు నర్థి వేఁడినఁ గడిమితోఁ
బొచ్చెంబుసేయక యిచ్చు టొకటి ;
బలితంపుఁబగతురఁ బరిమార్చు టొక్కటి ;
దండి యై యనిఁ జచ్చు టొండె నొకటి ;
శరణాగతుని నెట్టిశత్రుని నైనను
గరుణించి చంపక గాచు టొకటి ;
భామినీద్విజవృద్ధబాలాతురుల కైన
యాపదఁ జెచ్చెరఁ బాపు టొకటి ;

ఆ. యనఘ, యిద్ది ప్రతంబు లై చెల్లు నాకు నిం
దొకటి దప్పె నేని వికలకీర్తి
నగుదుఁ గాన, యిట్టి సఖిలభావముల నా
ఖండలునకుఁ గనచకుండలములు." ౭

—అరణ్యపర్వము. VII.

1 ఇచ్చుట. 2 ప్రసిద్ధము. 3 ఇంద్రుఁడు. 4 అధికమా? 5 వ్యర్థమైన. 6 అపకీర్తి. 7 సమీపించి.

## 38 విక్రమార్కునౌదార్యము.

సీ. ఉత్తమశ్లోకుఁడౌనుజ్జయినీరాజు
విక్రమార్కుఁడు దానవీరతిలకుఁ
డశ్వమేధాధికయజ్ఞదీక్షావిధి
వైగాని చేయుచో నాకవిభుఁడు
గరుడగంధర్వయక్షవ్రాతములతోడ
నరుదెంచి తోడ్పడి యాదరింప,
సుగల సంపదఁ జూచి ధరణీశుఁ డందులో
రత్నాకరుం డటు రామి యెఱిఁగి
ఆ యతనిఁ దోడితేర హితుఁ బురోహితు నంపెఁ
బ్రియము గూర్చి మైత్రి నయము మెఱయ:
విప్రవర్యుఁ డప్పుడు శీఘ్రప్రయాణంబున
దారి నడచి జలధిదరికిఁ జేరె. ౧

మ. అనురాగోక్తిఁ బురోహితుండు నిజరా
జాజ్ఞావిధిఁ, "వారిధీ,

నిను నేఁ బిల్చితి ; రమ్ము యజ్ఞమునకున్
నీ విప్రు," డంచున్ ఘన
ధ్వనిగాఁ జెప్పినయంత, నర్ణవుఁడు ది
వ్యాంబైనరూపంబునన్
దనరత్నంబులు నాల్గు దెచ్చి యనెఁ బొం
త న్నిల్చి యాద్విప్రుతో. ౨

వ. "ఓభూసురవర్య, మీతేనియజ్ఞశోభనంబునకుఁ గట్నం బుగా నిద్దివ్యరత్నంబు లిమ్ము. కోరినయంత నిది సైన్యసంపాదకం బగు; నిది బహుధనప్రదం బగు; నిది మృదువస్త్ర రత్నాభరణదాయకం బగు; నిది సుసాన్నప్రతిపాదకం బగు;" నని వేర్వేఱఁ దెలియంజెప్పి యిచ్చి వీడ్కొల్పిన, నవ్విప్రుఁ డును తన్మహిమాకర్ణనపూర్వకంబుగా నారత్నంబుల రాజున కర్పించెను. విక్రమార్కుం డంత నాభూసురునితో, ౩

క. "నీ కిందు వలచినట్టిది
గైకొనుమా ;" యన్న నాతఁ డతిసంభ్రముఁడై
"నా కాంతను నాకొడుకును
నాకోడలి నడిగివచ్చి నరపతి, కొనెదన్." ౪

వ. అని యింటికేఁగి యావద్వృత్తాంతము చెప్పి యాలో
చించుచు. ౫

సీ. "సైన్యంబు గల్గిన జగమెల్లఁ జేపడుఁ;
గాన నిది యౌ;" నని కొడుకు వల్కె;

తగ ధన మూల మిదం జగ త్తనుమాట
తగు నిది గాన "నని తండ్రి వల్కె;
"నిష్టాన్నములు మదిఁ దుష్టిఁ గాఁ గుడుతుము;
మే లిది గాను;" మని యాలు చెప్పె;
"భూషణాంబరముల భోగార్థ మిది గొంట
పెర వ;"ని కోడలు విన్నవించె;
గీ. నిట్లు వేలువేలు నిచ్చలు దమలోన
జగడమైన, నతఁడు మఱిగి వచ్చి
యింటివారికలహ మోటఁగించి, "వీనిలో
నీవ యొకటి యిమ్ము, దేవ," యనుఁడు. ౬
క. "ఈనలువురకుం దొక్కటి
యిం నేల? తలంపుకోలఁది నిట మీజగడం
బే నుడిపెద" నని యిడియం
డానాలుగుమాసికములు చాతని కిచ్చెన్" ౭
—సింహాసనద్వాత్రింశతిక. II.

## 39 నృ గ క థ.

సీ. ఉత్తమబ్రాహ్మణుం డొకనికి నొక్కనాఁ
డొకగోవు నిచ్చితి; నుల్ల మలర
నతఁడును గొనిపోయె; నని మేఁత కేర్థి మా
కదుపులలోపలఁ గలసి వచ్చె;
గోవులు మఱియును గోపాలకులు దాన
విధికి నై తెచ్చుచో, విధివశమున

వానిలో నదియును వచ్చిన నెఱుఁగక
దానంబు చేసితి ; దాని మున్ను
ఆ. గొనినయతఁడు [1]దడవి కని, "యిది నాదుగో"
వనియెఁ ; బిదపఁ గొనినయతఁడు పెనఁగి,
"నాకు నృపతి యొసఁగె" [2]నా, నిద్దఱకును వా
దైన, నన్నుఁ గాన నరుగుదెంచి ౧

వ. తమ తెఱఁ గెఱింగించి, ౨

క. "ఇచ్చినవారల కొనఁగా
వచ్చిన, నడ్డంబు గలదె, వసుధాధిప!" యం
చిచ్చఁ గడు నొచ్చి పలికిరి
వెచ్చనినిట్టూర్పు లడర విప్రు లిరువురున్. 3

ఉ. దానికి నేను జిత్తమునఁ
దాపము నొందుచు, మున్ను గొన్న య
మ్మానితవిప్రు వేఁడికొని,
"మంచివి గోవులు నీకు నూఱు, వే
యైనను నిచ్చెదన్; విడువ
వయ్య మహీసురవర్య, నెమ్మి న
ద్ధేనువు ;" నన్న, నాస్యమున
దీనత దోఁపఁగ నాతఁ డిట్లనున్. ౪

తే. "పాలు గడుఁ బెక్కు; దాని [3]సబాము లెస్స ;
పెయ్య కర్మిలి గలదు; మత్ప్రియసుతుండు

పాల కేడ్చినయప్పుడ చన్నట్టి నిచ్చు
నేదిప్రార్థైన ; నట్టిగో వెందుఁ గలదు ? ౫

క. శ్రీవోలె నింటిలో నా
గో వుండఁగఁ జూతుఁగాని, గోటి మొదవులుం
గావు సరి దాని;" కని భూ
దేవుఁడు వోవుటయు నేను దీనత దోఁచన్. ౬

చ. "కనకము ధేనువుల్ మణిని
కాయము లిచ్చెద ; నేమి గ్గైనఁ ద
క్కను మది కిష్ట మైనయది,
గోరుము గోవున;" కంచుఁ జేరి త
క్కినధరణీసురప్రవరుఁ
[4]గిడ్పడి యెమ్మెయి వేఁడికొన్న, "నేఁ
గొన భవదీయరాజ్యమును ;
కుత్సితవృత్తికి నియ్యకొందునే ! ౭

తే. అనియెఁగాని, నామాటఁ గైకొనఁడ యాతఁ;
డట్టియెడఁ [5]గాలవశగతి నూవహిల్లి
*జమునిపంపునఁ [6]గృకలాసజన్మ మొంది
వసుధనీరీతిఁ బడియున్నవాఁడఁ జిరము. ౮

తే. దేవ, నీదగు కారుణ్యదృష్టి యమృత
పూరమునుబోలె నామీఁదఁ బొలయుటయును,
దీనదశ వాసె ; భవదనుజ్ఞానిరూఢి
నేను జనియెద [7]సంచితస్థానమునకు." ౯

వ. అని నృగుండు వాసుదేవునకు సవినయప్రణామం బొనరించి విమానంబున నుత్తమలోకమునకుఁ బోయెను. ౧౦

—శాంతిపర్వము.

1 పరామర్శించి చూచి. 2 అనిపలుకఁగా. 3 స్వభావము. 4 తగ్గనమ్రభావముతో. 5 మృతి. 6 ఊసరవెల్లి. 7 ఆర్జించుకొన్న పదవికి.

## 40. పర్వతనారదోపాఖ్యానము.

సీ. నారదుండును వానినర్మిలిచెలియలి
కొడుకు పర్వతుఁడును గూడి వసుధఁ
ద్రిమ్మరువేడుక దివినుండి యొక్కటఁ
జనుదెంచి, తమలోన [1]సమయ మధిక
నిష్ఠమైఁ జేసిరి, "నిజచిత్తవృత్తు లొం
డొరులకుఁ దాఁపక యుండువార;
మటుగాక దాప, శాపార్హత వాటిల్లఁ
గలయది;" యని; యిట్లు కలయఁబలికి

తే. యుచితవర్తనమున నుండి, యొక్కనాఁడు
సృంజయునిఁ గాంచి, యతఁడు విశిష్టభక్తి
నర్చనము చేయఁగను, "భవదాలయమున
ననఘ, వసియింతుమే కొన్నిదినము?" లనిరి. ౧

వ. అందులకు నాపృథ్వీపతి ప్రియంబంది సుకుమారి యను నిజ నందనను దత్పరిచర్యార్థంబు నియోగించెను. నారదుండు దానిపైని మనసు చిక్క కృశింపుచుఁ దనతోడం జెప్ప సిగ్గు పడుచుండుటం గాంచి పర్వతుండు, ౨

ఆ. "రాచకూఁతుమీఁది రాగంబు పుట్టుట
నాకుఁ జెప్పవైతి ; నీకు శాప
మిత్తు ; నమ్మృగాక్షి నీవు చేపట్టిన
యంత వానరాస్యుఁ డగు ;" మనవుడు. 3

వ. నారదుండును "నీకు నాకలోకంబునకుఁ జనుట లేకుండెడు"
మని ప్రతిశాపం బిచ్చెను. అంతఁ బర్వతుం డచ్చోటు వాసి
యథేచ్ఛం జనియె. ౪

శా. శాపప్రాప్తికి నోర్చి తా నడిగె నా
చంద్రాస్య నన్నారదుం ;
డాపృథ్వీపతి యీఁ, బ్రియంబున వివా
హం బయ్యె ; నామాత్రలో
నాపూజ్యర్షియు 2వానరాననతఁ బొ
ల్పారంగ, నక్కాంత త
ద్రూపప్రాప్తి విరక్త గాక, తగఁ బ్రీ
తిం జేయుచుండెం బతిన్. ౫

*సీ. అటు లాపతివ్రత యర్పించుచుండ నా
రదుఁ డొక్కదివస మరణ్యమునకు
నేదేనిపనిం బని కేఁగినయెడ, నాడుఁ
బర్వతుం డగపడి భక్తి నెరఁగె ;
నొండొరుశాపంబు లొప్పారంగ నిరువురు
మరలించి రాజమందిరము చేర

నడుగఁగా, నారదు నారాజపుత్త్రిక
పరపూరుషుం డని వ్రాసి చనఁగ
ఆ. నగుచుఁ బర్వతుండు, "నాతి నీపతి యగు
విశ్వసింపు;" మని సవిస్తరముగ
శాపములును [3]మోక్షసంవిధానములును
జెప్పి తేర్చె దానిచిత్తవృత్తి. ౬
వ. ఇట్లు నారదుండును బర్వతుండును బరస్పరప్రియకారులై
యుల్లసిల్లిరి. ౭

—శాంతిపర్వము. I.

1 ఒడంబడిక. 2 క్రాంతిమొగములు కలుగుటచే. 3 శాపవిమోచన ప్రకారములు.

## 41 అవివేక చెలిమి.

క. కాననమం దొకబహుఫల
సూనక మగుభూరుహమున నొక్కసూచీముఖ మ
న్వానరమును దమలోపల
నూనిననెయ్యమున నుండ, నొకనాఁటినిశన్. ౧
క. మిన్నెల్ల నీలమేఘ
చ్ఛన్నం బై యొక్కవాన సాంద్రజలం బై
మున్నుగ గురిసి, తుద నీఁదయు
సన్నపుఁజినుకులును విపినచరబాధలు గాన్. ౨
వ. ఎడతెగక యున్నసమయంబున హానరంబు చెలి యగు నగ్గి
జిగాఁ డొకనాఁడు. 3

మున్ను చేసికొననిమోసాన, నీపాట్లు
పడఁగవలసె నిప్పుడు నడికిరేయి."

క. అని పక్షి హితము చెప్పిన
విని [4]వెంగలి యైనక్రోఁతి, "పేఁ డిరవ్వన నా
లును దాను నుండి, న న్నొక
పసినుఁగుంగాఁ దలఁచి గాదె ప్రేలం బోడఁగెఁ? ౧౦

క. "తనయింట దివియ యుండఁగ,
ననుఁ [6]గాయు మనందు; నెగడి నాతోఁ గొఱమా
లిన మాటల విసు వింతయుఁ
గొనకుండఁగ నాడె! నిట్టికుటిలుఁడు కలఁడే! ౧౧

చ. "తనకటె యిల్లు గల్గెనటె!
తా దొర, నా కటె యిల్లు లేదు! న
న్నునఁ గడుఁ గ్రొవ్వి నీపులుఁగు;
పుచ్చెద దీనిపొగరం;" బటంచుఁ బె
ళ్లునఁ దరుశాఖ విర్చి కపి
యచ్చటిచేరువ [7]పల్వలోదకం
బునఁ బడ వైచె, నంత వెఱ
పుట్టి ఖగాంగన కూయుచుండఁగన్. ౧౨

వ. అప్పుడు, ౧౩

క. తడిసిన [8]యెఱకలు, నీళ్లం
బడి బెగడినమనసుఁ గలుగు ప్రాణేశ్వరి న

నతఁడు ప్రియంబు గల్గునెడ
కర్పణసేసినఁ జేసెఁ గాక ; యీ
శిఖుతకరి వేలుపుందపసి
మమ్ముఁ దలంపఁగ నేల యచ్చటన్ ? ౨

క. పలుదెఱఁగుమర్ల్లి మాటలు
'కలహామె కల్యాణ' మని జగంబుల వెంట
న్మెలఁగెడు మౌనికి సహజము ;
వల దని వారింప వలదె వల్లభుఁ డతనిన్ ? ౩

క. ముని యేమి సేయు ? రుక్మిణి
గొన నేర మదేమి ? ధూర్తగోపాలుఁడు సే
సినచెయిద మేమి చెప్పుదు ?
మన మెరియెదె ప్రాణ మైనమఁగఁ డిట్లయినన్ ? ౪

ఉ. ఇన్నిదినంబులు న్సవతు
లిందఱలోఁ గడు గారవంబునన్
గన్నియ, నన్ను వల్లభుఁడు
గన్నులఁ గప్పుకొనంగ నుండి, యా
వన్నెయు వాసియుం దఱిఁగి,
వారు ననుం దల లెత్తి చూడఁగా
సన్నలఁ జాయలం బలుక
నైఁతునె ! ప్రాణము లెంతతీపొకో ! ౫

ఉ. నా మొగమోటకై వలని
నాటకము ల్ఘటియించి, రుక్మిణీ

తే. యరమరలు లేనిహాళిమి నవఁగి పెనఁగి
కొదలు దీఱనికోర్కులఁ గూడిమాడి,
కపట మెఱుఁగనిమమతలఁ గలసిమెలసి
యున్న 6విభుఁ డిట్లు సేయునే యోలతాంగి ? ౯

క. పతి ప్రాణసన్నిహితబంధువు ;
పతి దైవం ; 7బెనుగడయుఁ బతి సతులకు ; న
ప్పతియ కడు మేర దప్పిన,
గతి కులకాంతలకు వేఱు గలదే ? చెప్పుమా ! ౧౦

క. ధనమిచ్చి పుచ్చుకొన్నను
మనమున నోర్వంగ వచ్చు ; మగఁ డింతులకున్
జన విచ్చి పుచ్చుకొన్నను
మన వచ్చునె ? యింక నేటిమాటలు ? చెప్పుమా." ౧౧

క. అని వగలఁ బొగులుచు
జని 8సామర్షమునఁ గోపసదనంబునకున్
జనియె లలితాంగి, 9హరిచం
దనకోటరమునకు నాగతరుణియుఁ బోలెన్. ౧౨

—పారిజాతాపహరణము. I.

1 నారదుఁడు. 2 కానుక. 3 మాయలమారి దివ్యముని 4 దహించదా ? 5 ఇచ్చుటకయున్నట్లునటించి. 6 (నరకాసురునిసంహరించినవాఁడైన) శ్రీకృష్ణుని. 7 రక్షకము. 8 కోపముచే. 9 మంచిగంధపుఁజెట్టు తొఱ్ఱలోనికి.

జే వెడ దోఁపుచుం బలికెఁ
[5]జెందొవమోవులు క్రేళ్లఁ దాఁటఁగన్,— ౫

సీ. "వినుఁడు సురేశ్వరువనపాలకులు—వార్ధిఁ
బొడమినయీదివ్యభూరుహంబున
[6]కింద్రాణి యెవ్వతె? యింద్రుండు నెవ్వఁడు?
తోడఁబుట్టినయిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె, నతఁడె చేకొనుఁ గాక,
[7]తెక తేర యిది యేమి యొకరిసొమ్మొ?
యిదె నాథుఁ డిభునిచే నీరవదాస్యసంగంబు
నొడియించుకొని యేఁగుచున్నవాఁడు;
తే. బలుకు లేటికిఁ? దా వీరపత్ని యేని
మా శచీదేవి తనదు ప్రాణేశుఁ డైన
మఘవు నిటఁ బంపి సత్యభామావిధేయు
వలన మరలంగఁ గొనుఁ జెషో వాసితనము." ౬

క. అనిపలికినగర్వోక్తులు
విని వనపాలకులు చాల విస్మితు లగుచుం
జని చెప్పి రంతయును దా
రనిమిషపతికిం [9]బులోమజాన్వితునకున్. ౭

—పారిజాతాపహరణము, ౪ ఆశ్వా.

1 గరుత్మంతునివిషయ. 2 దేవవృక్షమును. 3 ఇంద్రుఁడు. 4 అన్యథవ యోగ్యమగునట్లుగా. 5 ఎఱ్ఱకలువలవంటి (కోపముచే జేవురించిన) మోవులు ఆవనపాలకులపై మూఁకుచుండఁగా. 6 ఇంద్రునిభార్య—శచీదేవి. 7 బొత్తిగా సంబంధము లేనిది. 8 కల్పవృక్షము (పారిజాతము). 9 శచీదేవితో నున్నవానికి.

నిటు వైచి పోవం గా శ్లేష్మాడె? నేడున్నాఁడు
శోకంబు వాోవ నిచ్చోటం గొంత
ప్రొ; ద్దంతలో విధి క్రూరుండు గానున్నఁ
బ్రాణంబు గృధ్రము రాక గల్గు
నో, యెఱుంగుమరె? యిచుండు నస్తాద్రిఁ
జేరఁడు; వెలుఁగ మీాగ నిలుచుఁ;"
తే. డనిన, వానిను మనమున నాస పుట్టి
మగిడివచ్చిన గృధ్ర, "యిష్టంబబుద్ధి
యైనవక్క-మాటలు విన నగునె? వికృత
మయ్యెఁ బీనుంగు; వచ్చునే యసువు లింక?. ౪
క. కడుఁ బెట్టిదుండు కాలుఁడు
మిడుక కమిడుక నపహరించు; మీా రీయాసల్
విడువుఁడు; బాలునికి సుగతిఁ
బడయుఁడు దానాదు లైనబహుధర్మములన్." ౫
వ. అని పలికిన, నాగృధ్రంబువచనంబు లాకర్ణించి యజ్జంబుకంబు వారల నుద్దేశించి, ౬
క. "క్రూరంబు గృధ్ర; మిట్టిక
మారకునిం జూచి జూచి మనలక, పోనగా
మీా రె ట్లోర్చెదరో? క
న్నీ రిటు నసుఁబోటులకును నిలువ కొలికెడున్. ౭
క. దయమాలి పోవ నేఁటికిఁ?
బ్రయత్నమునఁ బోదువ దైవబలమున మీాకుం

తాన తాన శవము పక్కకిఁ దీసెఁ గోరి
సుద్దు లిటులు పల్కెఁ జోద్యముగను. ౧౭

—శాంతిపర్వము. III.

1 భీష్ముఁడు. 2 ధర్మరాజునకు. 3 పడతి. 4 ఆలస్యముచేసిన. 5 కార్యము. 6 ప్రహారుఁడు, కఠినుఁడు. 7 ప్రకాశించుచుండఁగా. 8 జీవమును. 9 చేరఁగా.

## 45 కౌశికుని సుఖము.

ఉ. ఏ మని చెప్పువాఁడ? ధర
ణీశ్వర, యే పరతంత్రసంయమి
గ్రామణిశిష్యుఁడన్; జటిల
కౌశికుఁడన్; బహువేదశాస్త్రవి
ద్యామహనీయుఁడన్, బదరి
కాశ్రమవాసుఁడఁ; బుత్రికామణిన్
గోమలపాణి భానుమతిఁ,
గోల్పడి వచ్చినవాఁడ నక్కటా! ౧

సీ. వినవయ్య, ధరణీశ, విరివి నై [1]కప్పంపుఁ
గొండచేరువ నొక్కకోన గలదు;
బెడఁ గైనయక్కోననడుచక్కి మిక్కిలి
భీకరం బగునొక్కబిలము గలదు;
[2]తలఁ కింతయును లేక తద్బిలద్వారంబు
నరణిఁ బో, నొకరక్కసుఁడు గలఁడు;
ఘోరతరం బైనయా రక్కసునిచేఁ
బడిఁ బోవ, నటు నొక్కబయలు గలదు;

గీ. పరభయంకర మం దొక్కపురము గలదు ;
తత్పురం బేలు రాక్షసాధముం డొకండు ;
ఆత్మతరుణి కూడికగము చేయంగ నతఁడు
పొంచి సవరలఁ బాపలఁ గొంచుఁ బోవు. ౨

సీ. ఒకవేళ సింహ మై యుఱుకుచు బెదరించు ;
నొకవేళ హరిణ మై యొద్ద నిలుచు;
నొకవేళ భూజముల్ పెకలించు ఘోణి యై;
యొకవేళ కలభ మై యుద్భవిల్లు;
నొకవేళ మానిని యై యుద్యానోద్యాన వచ్చు ;
నొకవేళ నగ్గి యై యుఱుక వెలుఁగు;
నొకవేళ మేఘ మై యుఱుముచు నేతెంచు
నొకవేళ శైల మై యుండు నడుమ;
గీ. నద్దురాత్ముని మాయ యే మనఁగఁ గలదు ?
జపతపోనిష్ఠ లేమియు జరుగనీక
బదరికాశ్రమసీమతాపసుల నెల్ల
నలఁచి యేఁచుచు, నొక్కనాఁ డదను వేచి. 3

క. నాచిన్ని ముద్దుపాఁతురు,
నాచక్కనితల్లి సీత నడయాడఁగఁ 6ద
న్నిచు కొనిపోయె, సాళ్వము
రాచిలుకం గొంచుఁ బోవుక్రమమునఁ దండ్రీ. ౪

క. ఆ7సవ యొద్యాన నెఱిఁగి మ
హాసుర వెనువెంటఁ బోవ, నదలించి 8గత

త్రాసుఁ డయి చేతి⁹కత్తి గొని
వ్రేసెఁ నను నిట్లు రోషవివశుం డగుచున్. ౫

క. ఏడవ యేఁటిది; యెవ్వరు
వేడుక కదలించి రేని వెక్కుచు నేడ్చున్;
జూడ భయంకర యగునా
చేడియ కుడిగంబు లెట్లు చేఁయు; నృపాలా? ౬

క. అత్త దయామతిఁ దనకడ
[10]నత్తమిలక నిద్రవోవ దహరహమందున్;
బొత్తున గుడువక తాఁ [11]గడి
యెత్తదు తజ్జనని; యింక నే మయ్యెనొకో! ౭

సీ. కడుపార దొండపం డిడి ముద్దు గఱపిన
రాచిల్కకోదమలఁ జూచి చూచి,
పాదులలో నిండఁ బా ల్పోసి పెంచిన
చూతపోతంబులఁ జూచి చూచి,
తోడికన్నెలుఁ దాను గూడియాడి చరించు
సురపొన్నసీడలఁ జూచి చూచి,
బృందావనంబులు పెంచి తిన్నెలమీఁద
నూటఁ బెట్టిన ముగ్గు చూచి చూచి,

గీ. సంతసంబున దేవపూజలు ఘటించి,
పారికాంక్షులసేవ కై పరమనియతి
లీల నడయాడుచున్న బాలికలఁ జూచి
హృదయవీథిక నెట్లు భరించువాఁడ? ౮

ఉ. ఇం కిట మాట్ల లేమిటికి ?
నింతకు నాతనయాలలామ మే,
ణాంకనిభాస్య, యెందు నెటు
లా_ర్తిని బొందెనొ ? యెంత కుందెనో ?
శంకరసత్కృపారసవ
శంబునఁ గాంచినపుత్రి నిచ్చి నా
కింకను మాన్పి, వీరవర
కీ_ర్తిని గాంచఁగ దే నృపాగ్రణీ.

—రాజశేఖరచరిత్రము. II.

1 మందరగిరి. 2 భయము. 3 అందమైన. 4 పందియై. 5 మిడుత. 6 అనీచుఁడు. 7 జాడ. 8 పోయినభయము కలవాఁడై. 9 కొరడా. 10 శయనింపక. 11 ముద్ద.

## 46 వి ధి వి లా స ము.

*సీ. సౌవీరనరపతి సకలసద్గుణరాశి
నాత్మజాత సుశీల యనెడిదాని
చెలియలికొడుకు కీఁ దలఁచు ; నాతని రాణి
దనయన్నసుతున కీఁ దలఁచు ; నిట్టు
లెంతయుఁ దమలోనఁ బంతంబు వహియించి
యొకరిని గనుఁబ్రామి యొక్క రొకరు
తమతమయిచ్చ నుద్వాహంబుఁ బొసరింప
నెంచి, రావింపఁగా నిరువు రటకుఁ

తే. బెండ్లికొమరులు వచ్చి వేర్వేరు విడుదు
లందు నుండిరి ; యత్తఱి నభ్రవీథి
నరుగుచున్న త్రిమూర్తుల నజుని నడిగె
భర్గు, "డిం దెవ్వఁ డిక్కన్య పతి?" యటంచు ౧

చ. అడిగినఁ బద్మజుండు దర
హాసవిలాసముఖారవిందుఁడై,
"యడిగితి, శర్వ, యిందొకరి
కబ్బద, యీవధు; వల్ల[1]పిచ్చుగుం
టడరఁగ దీనిభర్త యగు ;"
నన్న మహాద్భుతచిత్తుఁ డౌచు నా
తఁడు మురవైరితో ననియెఁ
దత్త్వ మెఱుంగఁగఁ గోరి యందులన్. ౨

క. "గొనకొనినిజమొ ? కల్లయొ ?
కనుఁగొందము గాని, నీదుగరుడుని చే న
వ్వననిధియవ్వల నీపం
గుని విడిపింపు ;" మని చెప్ప ; గోవిందుండున్. 3

క. పనిచిన, 'మహాప్రసాదం ;'
బని [2]తార్క్ష్యుం డపుడె వార్ధియవ్వల నొకకా
ననమధ్యంబున వైచె న
తని, వాఁడును నచట నుండి దైన్యం బెసఁగన్, ౪

వ. ఆఁకట నాక్రోశించుచుండె. అది యెఱింగి దామోదరుఁ డతని
యాఁకలి దీర్ప గరుడునిఁ బంప నతం డరిగి పరికించుచు నా

సౌవీరపురంబున రాజసదనాభ్యంతరమున భక్ష్యభోజ్యం
బులుగలబోనకావడి యొకటి గని దాని నాపిచ్చుకుంటు
ముందటఁ నిడి, "నీ వీ [3]యశనంబు భక్షింపు;" మని పల్కి
పోయిన నతండు, ౫౯

ఆ బోనపుటికఁ దెఱవఁ బుష్పాస్త్రపాదిలోని
మోహనాస్త్ర మనఁగ ముగ్ధ యొకతె
వెడలి వచ్చి వాని మెడను మౌక్తికమాల
వైచి, తలను సేసఁబ్రాలు వోసె. ౬౦

వ. అంతఁ బోనక కాంచనపాత్రమున సరసభోజ్యములఁ దినఁ
బెట్టిన నతఁడు కడుఁపార భుజించి, యక్కన్య వృత్తాంత
మడిగిన, నది యిట్లనియెను,—

సీ. "మాతండ్రి సౌవీరమండలాధీశుఁ డా
తని పేరు ధాత; మాతల్లిపేరు
ధాత్రి; నన్నా రాజు తనతోడఁబుట్టిన
యతివపుత్త్రున కిత్త మనిన, నీక
తనయగ్రజునితనూజున కిత్తు నని పూని
కై సేసి నాచేత సేసఁబ్రాలు
నీముత్తియపుఁబేరు నిచ్చి, 'యీబోనపు
ట్టికఁ జేర్చి తెఱచుఁ గౌతుక మెలర్ప

ఆ. నెవ్వఁ డతఁడు నీకు హృదయేశుఁ; డతనివ
రింపు;' మని రహస్యరీతి నిట్లు

పనిచె నతనివీడుపట్టుకు; నిది నాప్ర
సంగ;" మనిన నాత్మఁ బొంగి యతఁడు. ౭

వ. [4]యాదృచ్ఛికప్రాప్తవిపత్సంపదల కచ్చెరువందు చుండె; నంత
నిక్కడ లగ్నవేళ యైన, ౮

క. ముద్దులపెండ్లికొమారిత
యొద్దరిఁ గానంగరాక, యెల్లను నగఁగా
నిద్దఱు పెండిలికొడుకులు
ప్రొద్దు గలుగ నూరు వెడలి పోయిరి లజ్జన్. ౯

ఉ. అవ్విధ మంతయుం గని ము
రాంతకుఁ, డంబుజగర్భుఁ జూచి, "నీ
రెవ్వరితోడఁ జెప్ప కిటు
లేఁగెద!" రన్నఁ జతుర్ముఖంబులన్
నవ్వుచు, "నోమహాత్మ, నృప
నందన నీభటుఁ జేరె; నింక వా
రెవ్వరివార లై నిలుతు
రిచ్చుట? నొచ్చెముగాదె యుండినన్?" ౧౦

మ. అనినన్, "వింటిగదా [5]పినాకి, మనతో
నబ్జాసనుం దప్పు డా
డినమాటల్ నిజ మయ్యె; మెచ్చఁ దగుఁజుం
డీ!" యంచు విష్ణుండు ప
ల్కె; "నటే, నాతనిఁ జూడఁ బోద ;" మని ప
ల్కెన్ ఫాలనేత్రుండు రం

డనియెం బద్మజుఁ; డట్లు ముప్పురును ను
దత్ప్రీతి సంధిల్లఁగన్. ౧౧

వ. అవధూవరులకుఁ బొడసూపిరి. విష్ణుండు వానికి నున్నత పదంబుతో పదంబు లిచ్చెను. బ్రహ్మ సుశీలకు నైదువతనంబు చాల నిచ్చెను. మహాదేవుండు వారి కైశ్వర్యం బొసంగె. వైనతేయుం డయ్యిరువురను సాపీరనగరంబు చేర్చెను. సుశీల తాఁ బోయివచ్చినతెఱంగు తల్లిదండ్రులకుఁ జెప్పి మగనిం జూప నెల్లరు సంతోషించిరి. ౧౨

—భోజరాజీయము. V.

1 కాళ్లులేనివాఁడు. 2 గరుత్మంతుఁడు. 3 భోజనము. 4 అలవోకగావచ్చునట్టి. 5 శీఘ్రఁడా.

## 47 గోవ్యాఘ్ర సంవాదము.

తే. ఒక్కగోరత్న మొక్కనాఁ డేకతంబ
1పొలము మేయుచుసుండ బెబ్బులి యొకండు
దానిఁ గని పొంచి యొడ లెల్లఁ దాఁచి వాల
మవనిఁ దాటించుచును వ్రేయ నడరుటయును. ౧

క. కలవరము లేక, "యోహో!
నిలు నిలు;" మని 2సురభి యి ట్లనియెఁ జయ్యన న
ప్పులితో, "నాకొకశిచన వీ
వలయు; వివేకించి సాదువాక్యము వినుమా. ౨

చ. మునుమును పుట్టె నాకు నొక
ముద్దులపట్టి; యతండు పుట్టి యే

డెనిమిదినాళ్లపాటి గలఁ;
డింతియ పూరియు మేయ నేరఁ; డేఁ
జని కడుపారఁ జన్ గుడిపి
చయ్యన వచ్చెద; నన్నుఁ బోయిర"
మ్మని [4]సుకృతంబు గట్టుకొన
వన్న, దయాగుణ ముల్లసిల్లఁగన్." 3

చ. అనవుడుఁ బుండరీక మప
హాస్యము చేసి, "యిదేమి! గోవ, యి
ట్లనియెదు? నన్నుఁ బెల్పఱిచి
యాత్మజుఁ డున్నెడ కేఁగి సత్వరం
బునఁ జనుదెంతు నంటి; విది
పోలునె? చెప్పెడువారు చెప్పినన్
వినియెడువారి కించుక వి
వేకము పుట్టదె? యింత యేఁటికిన్?" ౪

ఉ. నావుడు నిట్లనుం గపిల,
"నావచనంబు లనర్థకంబులే?
నీవు వివేకశీలుఁడవు;
నీ కిటు లాడుట యుక్తమే? ననుం
బోవిడు మంటి నిన్నెఱఁగి
పోవుటకే! పదివేలు చెప్పినన్
భూవలయంబులోఁ బలికి
బొంకుటయుం బ్రదుకే తలంపఁగన్!" ౫

క. అని శపథంబులు పలికిన
వినివ్యాఘ్రము, "నీవు ధర్మవిదురాలవు; నీ
[5]కెన యెవ్వరు? ధేనువ, యే
నిను నమ్మితిఁ బోయిరఁ"మ్మనినఁ బటుబుద్ధిన్. ౭

చ. పులికిఁ బ్రదక్షిణించి తలఁ
పుం బలుకున్ సత్యశంబు గాఁగ [6]న
స్ఖలితవిలాసయాన మెసఁ
గం, బురి కేఁగెఁ, జతుస్తనంబులుం
బలిసి పొదుంగు[7]వ్రేఁగుపఱ
పంగ, గభీరరవంబుతోడ; వీ
థుల నడయాడుబాలకులు
దోరపుభీతిఁ దొలంగి పాఱఁగన్. ౭

*వ. ఆరవంబు రసాయనమై చెవి సోఁకఁగా 'వత్సంబు' పరువున వచ్చి కడుముద్దులు మురిపంబులు నూపుచు గుప్పుగుప్పునఁ దన పాలిపాలు గ్రోవెను. అంత విప్రగృహిణిచేతి కలశంబునిండఁ బాలుపిండి,ఆగోవు శైశవక్రీడలఁబచరించు వత్సంబుఁ జూచి, "యితఁడు ఇఁకెనెంతచుల్కనై యెట్టి యిడుమలపాలగునో?" అని లోన శోకించి వానికిఁదగినబుద్ధులు సెప్పి తన వృత్తాంతమంతయు మెల్లన వచించి, నిజాత్మజుశోకదావాగ్నిని దనవచనామృతవృష్టిచేఁ జల్లార్చి, 'ఇడ వయ్యో పులియే మనుకొనునో? యెటు లాఁకటఁ బొగలుచున్నదో?'

అని వత్సమును వీడ్కొని రయంబున వచ్చుచుండ, నక్కడ
నప్పులి యిట్లు వితర్కించెను, ౮

క. "ఈపాటి గలదె పసరమునకు!
వ్రేటులవిం గదిసినపుడె విఱువక, నే న
మ్మాటల బేలుపడితి; మొగ
మోట దరిద్రత్వమునకు నోఁగిఁ బొత్తయ్యెన్." ౯

చ. అని యుదరాగ్ని చేఁ బరవ
శాత్మకమై ధృతిదూలి నెమ్మనం
బునఁ దలపోయుచున్న పులి
ముందటిభూమికిఁ జేర నప్పుడో
యనఁగ మహాద్భుతం బగుర
యంబునఁ దాఁ బఱతెంచి ధేను వి
ట్లను, "నిదిప్రొద్దుదాఁకఁ గదు.
నాఁకొని యే క్రియ నుండితో కదే! ౧౦

క. నామన సొక్కటి యయ్యెను;
నీమన సారఁగ భుజింపు; నీకే నధిక
ప్రేమమున నమర్పించితి
నామే నిది; పుణ్యగతికి ననుఁ బుచ్చననా." ౧౧

క. అని గంగడోలు భిగియఁగఁ
దనమెడ యెత్తికొని కపిల దగ్గఱఁ జనుదెం
చినఁ జూచి పుండరీకము
వెనువెనుకనె పోవుఁగాని విఱుపదు దానిన్. ౧౨

ఆ. అట్టి దాని తెఱువ కద్భుతస్వాంతుఁ డై
పుండరీక, "మేను బుట్టి పెరిఁగి
యింతవాఁడ నైతి; నింత నిష్కపటుల,
నిట్టి ధీరమతుల నెఱుఁగ నేను." ౧౩

వ. అని యాధేనుపుత్రో, "నీసత్యమునకు మెచ్చితి నినుఁ జంపఁ
జాల; పొమ్ము. నీపుత్త్రకునితో సుఖముండుము." అని పలి
కెను. ధేనువు వత్సమును జేరి సుఖంబుండె. ౧౪

—భోజరాజీయము. VI.

1 మంచుగలిసినగడ్డి. 2 ఆవు. 3 కోరిక. 4 పుస్నెముగట్టుకొనుము.
5 సాటి. 6 తొట్రుపడనివిశ్వాసముతోడి నడక. 7 బరువెక్కఁజేయఁగా.
8 న్యాయము. 9 ప్రేటునకు అందునంతదూరమున.

## 48 చోరుని సౌజన్యము.

గీ. నందినీనామనగరంబునందుఁ గలఁడు
బంధుకుం డనియెడునొక బ్రాహ్మణుండు;
ధనికుఁ డఁటతోల్లి; 1యవిలంఘ్యదైవఘటనఁ
బిన్న లై పుత్త్రు లుండంగఁ బేదపడియె. ౧

వ. దారిద్ర్యంబు దుస్సహం బగుచు, 2దుఃఖవ్యూహవాహిని
యగుగేహినిని, ఆఁకట నకనకలాడుబిడ్డలను జూడ నేరక,
లేమి తొలఁగునుపాయంబుఁ గానక, 'పూర్ణధనుండును గుణ
గరిష్ఠుండును నైన 3మనసుజన్ముని విపులుని డాసి, యాతం
డొసంగుసస్థంబుతోఁ గృషి చేసి జీవింతుఁగాక;' అని నిశ్చ

యించికొని 4కతిపయదినప్రయాణంబునఁ దదీయనగరంబు
చేరిన, ౨

క. విపులుం డగ్రజునకుఁ దగు
సుపచారంబులు 5ప్రమోద ముత్కటముగ ని
ష్కపుభక్తిఁ జలిపి, యాతఁడు
విపన్నుఁ డగు టతనిచేత విని దుఃఖితుఁ డై. 3

*ఉ. తాను గళత్రపుత్త్రసహి
తంబుగ నగ్రజు నర్చసేయుచున్
మానితరీతి నుండె; నొక
మాసము వోవుడు నింటి కేఁగఁగా
మానస మైనయన్న 6నొక
మాపు7రసాల నిషక్తపూధపీ
శ్రీనిభృతాంగణంబునకుఁ
జీరి రహస్యము పల్కె నిట్టులన్. ౪

క. "కొనిపోవ రాదు తెరువునఁ
గనకము; 8 లెక్కలి ఘనంబు; కాకున్నను మో
వను రాదు పెద్దహేమం;
బని యన్నకుఁ దెలియఁ జెప్పి, యకుటిలమతి యై. ౫

*క. వెలపొడవుమానికము కర
తలమున నిడి మ్రింగఁజేసి, తానిట్టు పలికెన్
"మలినాంబరములుఁ దాలిచి
వెలలుఁడు నిరుపేదపోల్కి వేకువవేళన్." ౬

వ. అని చెప్పి యిరువురు శయనస్థానంబుల కరుగుటయు, ౭

క. వారలపలుకులుఁ దద్వ్యా
పారంబులుఁ దెలియ నెఱిఁగి ప్రమదహృదయుఁడై
చోరుం డొకరుం డచ్చటి
భూరుహమున నుండి వారు పోయినవెనుకన్. ౮

గీ. పయన మై పోవుబ్రాహ్మణుపజ్జఁ దగిలి
సాధువోలె నాతనితోడ సముచితంపు
భాష లాడుచుఁ మణిదోచుపనికి ననువు
తలఁచికొనుఁ జోరకుండును దనమనమ్మున, ౯

క. "నడుమ నలవడదు, ముందటి
యడవిం దెగఁజూతు విప్రు;" నని తలఁచుచు న
య్యడవి దరిసి యరుగఁగ న
క్కడఁ [9]దెక్కలికాఁడు వచ్చి కడురౌద్రమునన్. ౧౦

క. ఇరువురఁ గట్టియుఁ గొట్టియుఁ
బరిభవములు వెట్టఁ బేదపన్నల ఘనుచున్
గరుణముగఁ బలుకఁగాఁ గృప
[10]యొరగినచిత్తముల వార లొండొరుతోడన్. ౧౧

క. "ఈయొడళుల కోకలు
వేయైనను దగవు; కపటవేషము లివి; యీ
మాయలకు మన్కు లేదె యు
పాయము? చీరుదము వీరిఁ బట్టి యుదరముల్." ౧౨

వ. అనుచుండ నందులో ముఖ్యు లగువారు, ౧౩

గీ. "వ్రత్త మొకనికడుపు; వ్రయ్యంగ నందుఁబోఁ
బసిఁడి లేకయున్నఁ బసుని బ్రదికి
యరుగనిత్త; ముండిన క్షైన నితరుని
వ్రత్త; మిదిగాని కార్యవృత్త;" మనుచు, ౧౪

వ. నిశ్చయించి తమయిరువురలో నొకని వధియింప నుద్యుక్తు
లగు సమయంబునఁ, జోరుఁ డాత్మగతంబున, ౧౫

క "ఏ నేమి తలఁచి వచ్చినఁ
దా నేమి తలంచె నిచట దైవం; బవురా!
తా నొక్కటి తలఁపఁగ విధి
తా నొక్కటి తలఁచు ననుట తథ్యం బయ్యెన్. ౧౬

గీ. ఇతనికడుపు వ్రచ్చి, యిం దిప్డు రత్నంబుఁ
గాంచి లేని, నాదుకడుపు వ్రత్తు;
రురక చంపి పోదు; రూరక విడువరు;
కడుపు వ్రచ్చు టెట్లు గట్టి నాకు. ౧౭

వ. అయినను, ౧౮

క. [11]తనకడుపు మున్ను వ్రచ్చినఁ
గనకము లేకున్న, నతనిఁ గాచెద రెట్లుం
దనఁ విడువ రింక; బహుచిం
తనములఁ బని యేల? కాచెదం గా కితనిన్." ౧౯

వ. అని కృతనిశ్చయుం డై చోరుండు, ౨౦

క. తనకడుపు మున్ను వ్రచ్చుం
డనుటయు, నటు చేసి వారలం దేమియుఁ గా

ననివారై, "యీతని ప్ర
చ్ఛినయట్టులకాదె? యేల చెనఁటిగఁ జంపన్?" ౨౧

వ. అనుచు నవ్విప్రు బంధవిముక్తునిం జేసి చను మనుటయు, ౨౨

క. క్రూరులచే విడివడి సుత
దారాదులఁ గలసి యతఁడు ధన్యుం డయ్యెన్;
జోరుఁడు వివేకహీనస
చోరుఁడు నాకమున కరిగి సుఖియై యుండెన్. ౨౩

1 దాటరాని. 2 దుఃఖసమూహమును వహించుచున్నది. 3 తమ్ముని. 4 కొన్నిదినములు. 5 సంతోషమతిశయింపఁగా. 6 రాత్రివేళ. 7 తీయ మామిడిచెట్టు నల్లుకొనియున్న బండిగురివెంద పెంపుచే నిగూఢముగానున్న యింటిలోనికి. 8 దొంగతనము. 9 దొంగలు. 10 నశించిన-లేని అని తాత్పర్యము. 11 నాకదుపు.

పద్యకథామంజరి సమాప్తము.

# అనుబంధము—(I) మాదిరి ప్రశ్నలు.

కథ.

5 1. జంబుకమునకుఁ గలిగిన భయకారణ మేమి? 2. అదెట్లు తొలఁగెను? 3. దానికిఁ గలిగిన యాశయేమి? అది ఎట్లు వ్యర్థమయ్యెను? 4. అది ఏమనుకొనెను?

7 1. ఒంటె ఏమివరము కోరుకొనెను? 2. వరగర్వముచే అది ఏమి చేసెను? 3. అది ఎట్లు చెడెను? ఏలచెడెను?

12 1. బలికి త్రిలోకరాజ్యము ఏనిమిత్తమున వశమయ్యెను? 2. అతనిరాజ్య ప్రాభవము ఏమయ్యెను? ఏల? 3. బలముతోఁ గూడియుండు ధర్మములు ఏవి?

15 1. రంతిదేవుఁడు ఏల పేదయయ్యెను? 2. అతనియతిథు లెవరు? 3. వారి కెట్లెట్లు అతఁ డాతిథ్యమిచ్చెను? 4. అతని కెట్లు కైవల్యముసిద్ధించెను?

16 1. లిఖితుఁ డొనర్చిన పాపమేమి? 2. శంఖుఁడు విధించిన ప్రాయశ్చిత్తమేమి? 3. పాపికి యమదండన తప్పనుపాయ మేమి? 4. రాజునకు ఎప్పుడు ధర్మవైకల్యపాపము వచ్చును? 5. ఏటికి 'బాహుద' అని పేరు ఏల కలిగెను?

19 1. సంతలో బియ్యపువాఁడు ఏమివెల చెప్పెను? 2. అతని నెల్లరు ఎట్లు గేలిచేసిరి? 3. వైశ్యబాలిక ఎట్లు బియ్యము తీసికొనెను? 4. కాంచనగుప్తుఁడు దానిని ఏల కోడలిఁ జేసికొనెను?

22 1. జన్మవృక్షంపుఁ గమనీయ ఫలములేవి? 2. భేదమేమి? ఏది ఏల హెచ్చు? 3. ఆ రెండుఫలముల వృత్తాంతము రేఖాంబ మాంచాలకు ఎందులకు వివరించిచెప్పెను? 4. వీరపత్ని ధర్మమేమి?

32 1. తన్నువిడిచిపుచ్చుమనుటకు హంస నలమహారాజుతోఁ జెప్పిన యుపపత్తు లేవి? 2. హంస మృతినొందిన దానికుటుంబస్థితి ఎట్లుండును? 3. నలుఁడు హంసను ఏల విడిచిపెట్టెను?

**33** 1. ఆఁడుచిలుక బోయవానిని ఎట్లు మందలించెను? 2. వాఁడేమిచెప్పెను? 3. శుకి బోయవానిని జంపుటకు ఏమియుక్తిచేసెను? 4. "నమ్మిక లివియేటి కి?" అనుపద్యములో ఆఁడుచిలుకయంతరార్థమేమి స్ఫురించుచున్నది?

**35** 1. జడదారి సిరియాళునితోఁ జెప్పినవాక్యము లేవి? 2. సిరియాళుఁ డేమి బదులుపలికెను? 3. 'వీఁడు చిఱుతొండనంబికంటె నధికుఁడు.' ఎట్లు?

**36** 1. కపిముఖ్యులుచెప్పిన సముద్రతరణోపాయము లేవి? 2. శ్రీరాముఁడు ఏల అవి కాదనెను? ఆయన నిశ్చయమేమి? 3. అందులకు సముద్రుఁ డేమిచెప్పెను? ఏమియుపాయము చెప్పెను?

**40** 1. పర్వతనారదుల బాంధవ్యమేమి? వారు చేసికొన్న యొడంబడిక ఏమి? 2. నారదుఁ డెట్లది తప్పెను? 3. పరస్పరము వారిరువు రిచ్చుకొనిన శాపము లేవి? అవి ఎట్లుతొలఁగినవి? 4. సుకుమారిపాతివ్రత్యము నిరూపింపుము.

**41** 1. ఆనాఁటి నిశను వర్ణింపుము. 2. గిజిగాఁడు చీఁకటివాపికొన నేమిచేసినది? 3. అది క్రోఁతితో నేమిచెప్పెను? 4. క్రోఁతికి ఏల కోపము వచ్చెను? అది ఏమితలపోసికొనెను? ఏమిచేసెను?

**42** 1. సత్యభామ శ్రీకృష్ణునకు ఎట్టిప్రేమ తనయందున్నట్లు ఉగ్గడించెను? 2. ఆమె ఎవరిపైని ఎక్కువ తప్పు తేల్చెను? ఏల?

**43** 1. శ్రీకృష్ణుఁడు పారిజాతము హరించునెడ నందనవనపాలకు లేమి పల్కిరి? 2. సత్యభామ కృష్ణుని ఏల వారించి, తాను బదులుపల్కినది? 3. ఏమిపల్కినది?

**44** 1. గృధ్రజంబుకాఖ్యానమును సంవాదరూపమున వ్రాయుము. 2. అవి అట్లుపల్కుటలో గూఢాభిప్రాయమేమి? 3. నీతి ఏమి?

**45** 1. జటిలకౌశికుఁ డెవఁడు? 2. అతనికూఁతును రాక్షసుఁ డేల, ఎట్లు హరించెను? 3. రాక్షసుని యువతికినట్లు వర్ణించునది. 4. రాక్షసునిమాయలు వర్ణింపుము. 5. కౌశికునిపుత్రికయొక్క బాల్యస్వభావమును వర్ణింపుము.

**46** 1. సుశీల తలిదండ్రుల ప్రయత్నము లెవ్వి? 2. బ్రహ్మ సుశీల ఎవనికి భార్య యగు ననెను? 3. దానిని తప్పింప హరిహరులు ఏమిచేసిరి? 4. మఱి

బ్రహ్మవాక్యము ఎట్లు నిజమగుట ఘటిల్లెను? 5. పెండ్లికుమారులు వెడలి పోవుటకు కారణ మడుగఁగా విష్ణుతో బ్రహ్మ యేమిచెప్పెను? 6. త్రిమూర్తులు ఏయేవరము లిచ్చిరి?

47 1. పులి కొట్టరాఁగా ఆవు ఏల కలవరపడలేదు? అది పులితో నేమి చెప్పెను? 2. గోవ్యాఘ్ర భాషణములు సంవాదరూపమున వ్రాయునది. 3. దూడతో ఆవు ఏమిచెప్పెను? 4. పులి ఆవు నేల చంపనొల్లదు? ఏమిపల్కెను?

48 1. బంధువుని పేదతనము వర్ణించునది. 2 తమ్ముని భ్రాతృభక్తిని నిరూపింపుము. 3. నడిరాత్రి ఏల ఎక్కడ తమ్ముడు అన్నతో రహస్యము చెప్పెను? ఏమిచెప్పెను? 4. చోరుఁ డెక్కడనుండి వినెను? విని ఏమి యాలోచించెను? 5. ముందటియడవిలో కలిగినయాపద ఏమి? 6. చోరుఁడు ఏల బ్రాహ్మణుని రక్షింపనెంచెను? ఎట్లు రక్షించెను?

## అనుబంధము—(II) ఉక్త్యోదాహరణప్రతి.

### 3 కథ.

ఒకనాఁటిరాత్రి చలి యెక్కువగనుండెను. అడవిలో కోఁతులు గడగడ వణఁకుచు, ఒక్కచోట గుమిగూడి చలిచే బాధపడుచుండెను. అప్పుడు వానికి మిడుఁగురుఁబురువులగుంపొకటి యగపడెను. నిప్పుకణిక లనుకొని, వానితోఁ జలిగాఁచుకొన కోఁతులు సనుకట్టినవి. అది సూచీముఖి యనుపక్షి చూచెను. అవి నిప్పుకణికలు కావని అది యెఱుఁగును. దానిని కోఁతులకు చెప్పకపోయిన నావలదా అని ఆపక్షి కొంచెము ఆలోచించి ఎట్టకేలకు ఒక కోఁతిని జూచి మిగుల నాదరముతో ఆవిషయము చెప్పినది. అది వినిపించుకొనలేదు. పిలువని పేరంటముగా చెవులు చిల్లులుపడ మాటిమాటికి ఆపక్షి అట్లు వాకొనుచుండఁగా, అందొక కోఁతికిఁ గోపమువచ్చెను. అది పండ్లుకొఱుకుచు, "నిన్నెవ రడిగిరి? ఎందుల కీనోటిటీట నీకు?" అని దానిని పట్టుకొని రాతిమీఁదఁ గొట్టి చంపెను. పనికిమాలినవారలకు బోధింపఁబోయిన చేటు వచ్చుననుట నిజము.

---

# శోధనలేశము.

| పుట. | పఙ్క్తి. | ఉన్నరూపము. | సవరణ. |
|---|---|---|---|
| 1 | 19 | బరఁగు | బరగు |
| 3 | 11 | బండిన | ఁబండిన |
| 7 | 6 | నావుఁడు | నావ్వుడు |
| 8 | 2 | కంఠనఠంబులు | కంఠంబు |
| 12 | 5 | తోడఁబడి | తోడిఁభడి |
| 15 | 2 | 4నన్ను | నను |
| 16 | 21 | వినఁబడేఁ | వినఁబడే |
| 40 | 19 | బిమ్ము. | విమ్ము |
| 42 | 23 | భూపవరేణ్యా, | ఁబూర్వపుభంగిఁ. |
| 53 | 4 | తిరుహాముం | శ్రీ తిరుహాముం |
| 59 | 21 | వండింపుము | దండింపుము |
| 69 | 19 | నెఱుఁగనే | నెఱుఁగ నీ |
| 75 | 11 | అనుఁడు | అనుడు |
| 80 | 15 | ముఖమ | ముఖము |
| 88 | 10 | నాఘు | నాదు |
| 91 | 19 | చుట్టుఁజేరి | చుట్టునాఁజేరి |

ఇంకను అర్థానుస్వార విరామచిహ్నాదులైన పొరబాటుపడినవి. సవరించుకొనవలెను.

# వేదము వేంకటరాయశాస్త్రిగారి గ్రంథములు.

## నాటకములు.

| | | | |
|---|---|---|---|
| ప్రతాపరుద్రీయము (క్రౌనుసైజు) | ... | 1 | 8 |
| ఉష ,, | ... | 1 | 4 |
| బొబ్బిలియుద్ధనాటకము | ... | 1 | 4 |
| శాకుంతలము | ... | 1 | 0 |
| విక్రమోర్వశీయము | ... | 0 | 12 |
| మాళవికాగ్నిమిత్రము | ... | 0 | 12 |
| ఉత్తరరామచరిత్రము | ... | 1 | 12 |
| నాగానందము | ... | 1 | 0 |
| ప్రియదర్శిక | ... | 0 | 8 |
| రత్నావళి (వ్యాఖ్యా పీఠికలతో) | ... | 1 | 4 |

## విమర్శలు—ఉపన్యాసములు.

| | | | |
|---|---|---|---|
| గ్రామ్యభాషాప్రయోగనిబంధనము | ... | 0 | 12 |
| విమర్శవినోదము | ... | 0 | 12 |
| విసంధివివేకము | ... | 0 | 2 |
| తిక్కనవిజయము | ... | 0 | [illegible] |
| భారతాభారతరూపకమర్యాదలు (భరత x షేక్స్పియరు) | ... | 0 | |
| ఆంధ్రగ్రంథవిమర్శనప్రకారలేశము | ... | 0 | |
| గ్రామ్యాదేశనిరసనము | ... | 0 | 4 |
| కావ్యాలంకారచూడామణి (పూర్తి) | ... | 1 | 4 |
| ఆంధ్రహితోపదేశచంపువు | ... | 1 | 4 |
| ఛందస్సు | ... | 0 | 3 |
| అలంకారసారసంగ్రహము | ... | 0 | 12 |

Printed at Chandrika Press, Madras.—9-11-45
Publisher's Quota P. I. C. Q. H. No. M. S. 114 B.
2000 Copies.